# తాలూకా గ్రంథాలయ మహాసభ

## ప్రత్యేక సంచిక

మండూరు :: **31-5-63**

# గ్రంథాలయ దర్శిని

నిర్వాహకులు:

*గరికపాటి రామారావు*

*వెలగా వెంకటప్పయ్య*

# ముందుమాట

ఈ ప్రత్యేక సంచికను పూర్తి వివరములతో సర్వాంగ సుందరముగా తీర్చి దిద్దుదామనే తలంపుతో తాలూకాలోని అన్ని గ్రంథాలయములను రెండు నెలల పూర్వమునుండి పదేపదే కోరుచూ ఉంటిని. కాని బహుకొద్దిమంది మాత్రం వివరములు పంపియున్నారు. కొన్ని గ్రంథాలయములకు స్వయముగ హాజరై సేకరించితిని. కొన్ని వివరములను మిత్రులద్వారా సేకరించితిని.

తెనాలి తాలూకాలో రెవిన్యూవారి లెక్కల ప్రకారం 81 గ్రామములు గలవు. వీటిని 5 బ్లాకులక్రింద విభజించియుండిరి. ఈ 81 గ్రామములలో ఒకటి రెండు మినహాయించితే దాదాపు అన్ని గ్రామాలలోను గ్రంథాలయము లుండియుండునని ఊహించితిని. కాని ఊహించినంత ఫలితం దక్కలేదు.

1938 లో గుంటూరు మండల గ్రంథాలయ సంఘమువారిచే ప్రచురించబడిన సంచిక ఆధారంతోను, మిత్రుడు శ్రీ వెంకటప్పయ్య సహాయముతోను కొన్ని వివరములు ప్రచురించ గలిగితిమి. కాని తృప్తిగాలేదు. త్వరలో పూర్తి వివరములతో అనుబంధము ప్రచురించుదామనే యూహ ఉన్నది. కావున గ్రంథాలయాధ్యక్షులైన తమ గ్రంథాలయమును గూర్చిన వివరములు ప్రచురించలేదని బాధపడవలదని మనవి.

కోరినదే తడవుగ తమతమ వ్యాసముల నందజేసి నన్ను ప్రోత్సాహపరచిన పూజనీయులైన పెద్దలకు, సోదరీ సోదరులకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

పెద్దలైన వారికి యిందు యేవైన లోపములు కనుపించిన వెంటనే నాకు తెలియపరచుచు - ముందుముందు నాకు సహాయపడ గలందులకు కోరుచున్నాను.

మండూరు
31—5—1963

ఇట్లు,
గరికపాటి రామారావు

సంఘశక్తి నేటికాలంలో గొప్ప సాధనం

గ్రంథాలయం ఆదర్శమైన సాంఘిక కేంద్రం

ఇట్టి గ్రంథాలయాల సమ్మేళనమే

# ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం

వ్యక్తులు, సంస్థలు సభ్యులుగ చేరవచ్చును.

వారికి సంఘపత్రిక

## గ్రంథాలయ సర్వస్వము

ఉచితము.

సంవత్సర చందా రు. 5-0-0 మాత్రం.

వివరాలకు:

**ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం**

విజయవాడ - 6

# స్వాగతోపన్యాసము

శ్రీ గరికపాటి రామారావు

పూజనీయులైన పెద్దలారా!
గ్రంథాలయోద్యమాభిమానులారా!
గ్రంథాలయ ప్రతినిధులారా!

మీ కందఱకు మా గ్రామస్థుల తరపున నా హృదయపూర్వక సుస్వాగతము-

ఈ తెనాలితాలూకా గ్రంథాలయ మహాసభల సందర్భమున మా యాహ్వానమును గౌరవించి కడుదూరమునుండి మిక్కిలి ప్రయాసముతో ప్రయాణముచేసి మారుమూలనున్న మా గ్రామము (మాండలేశ్వరపురము - మండూరు) నకు విచ్చేసిన పెద్దలైన మీ కందరకు నా హృదయపూర్వక వందనములను, స్వాగతమును చెప్పుకొను అవకాశము నాకు కలిగినందుకు ఎంతయో సంతసించుచున్నాను.

ఇంత శ్రమపడి మీరంద ఱిక్కడకు విచ్చేసినందులకు మీకు దగిన సత్కారము లొనర్చి మీ భోజన మజ్జన పానాదులకుం దగు సౌకర్యములను ఉచితరీతిని గలుగజేయునంతటిశక్తి మాకు లేనప్పటికిన్ని ఈ భారము మాపై వైచుకొనుట దానిని జయప్రదముగా కొనసాగింపగలశక్తి మాకు గలదనెడి ధైర్యముండికాదు. మీ యందఱివలె మాకును యీ గ్రంథ భాండాగారోద్యమమునందుగల యుత్సాహమే కారణము. కావున మేము మీ యెడల జరుపవలసిన యుదారకృత్యముల విషయమై మాకుగల యుద్దేశముల మాత్రమే మీరు భావించి లోపములున్న మన్నింప గోరుచున్నాము.

ప్రథమముగా యీ సభలు రెండు మాసాల క్రితం జరుప నిర్ణయించియుంటిమి. కాని ఆశించినంతగా సమాచారము సహకారము

ఈ తాలూకాలోని గ్రంథాలయ నిర్వాహకులవద్దనుండి పొందలేకపోతిని. గుంటూరుజిల్లా చరిత్రలోనేకాదు, దేశచరిత్రలోను మన యీ తెనాలి తాలూకాకు అన్ని రంగాలలో అగ్రస్థాన మివ్వబడియున్నది. ఈనాడు యీ మహాసభలు జరుపబూనుకున్నది ఏ ఒక్కరి స్వలాభంకోసంకాదు, అందరికి కొన్ని క్రొత్తవిషయాలు చెపుదామనే తలంపుతోనే—

ఒకనాడు యీ గ్రంథాలయోద్యమం భారత జాతీయ సౌధ నిర్మాణమునకే పునాదులు వేసెనని విన్నాము. జాతీయోద్ధారణ సాధకము లగు అన్ని సదుద్యమములకును ఈ గ్రంథాలయములు ఉగ్గుపట్టలుగ నుండెడివని విన్నాము. కాని యీనాడు గ్రామాలలో గ్రంథాలయాలు నిద్రబోతున్నవని చెప్పక తప్పదు. అంటే గ్రామంలోని ప్రజలేనని చెప్పాల్సి వుంటుంది. ఏలనన యీనాడు గ్రామాలలో విజ్ఞానవంతుల మనుకునేవారు విరివిగా వుండడమే—ఎవరికివారే – వారిలోవారే – పొరుగువారితో పని లేకుండ అంతా మనకు తెలుసు—ఒకచోటికిపోయి తెలుసుకునేదేమిటి అనే హ్రస్వదృష్టిగలిగి వుండడమే—దానికితోడు యీనాటి రాజకీయనాయకులు తెచ్చిపెడుతున్న సమస్యలుకూడ తోడవుతున్నవి.

గ్రామాలు బాగుపడాలంటే నేడు గ్రామాలలో విరివిగా బయలు దేరిన హ్రస్వదృష్టిగలవారికి బుద్ధివికాసం కలిగించాల్సివుంది.

ఇందుకు ప్రతిగ్రామంలోను సమిష్టి సహకారంతో ఒక గ్రంథాలయం స్థాపించబడాలి అని నేను నమ్ముతున్నాను.

సర్వమానవ సమానత్వంగల సామ్యవాద సమాజనిర్మాణమే తన ప్రధాన లక్ష్యమని మన జాతీయకాంగ్రెస్ స్పష్టంగా ప్రకటించింది. ఈ లక్ష్యంతోనే మన నెహ్రూజీ నాయకత్వాన కేంద్ర, రాష్ట్ర జాతీయ ప్రభుత్వాలు నిరంతర కృషి చేస్తున్నవి. అనేక ప్రణాళికలు రూపొందించి అమలు జరుపుతున్నవి. అయితే కేవలం ఒక్క ప్రభుత్వ కృషివల్లనే యీలక్ష్యం సాధ్యమౌతుందా! కాదు.


శ్రీ గరికపాటి రామారావుగారు

అన్ని రంగాలలోను ప్రభుత్వ కృషికితోడు ప్రజా సహకారం కూడ అవసరమన్న విషయం తమ కందరికి తెలియనిదికాదు. అయితే ఒక్కటిమాత్రం తెలుసుకోవాలి—

కేవలం వ్యక్తులుగా సహకరించే కంటే సమాజంలోగల సమస్త వర్గాలకు, సర్వరంగాలలో సమాన ప్రతిపత్తి, సమాన అవకాశాలు ప్రాతిపదికగా సుసంఘటితమైన పురోభివృద్ధికి దోహదమిచ్చే సంస్థల ద్వారా సహకారం లభిస్తేనే మన లక్ష్యసాధన సులభతరం అవుతుంది.

ఆ ఉద్దేశ్యంతోనే యీ గ్రంధాలయ సభలు ఏర్పాటు చేయాలనుకున్నది. పెద్దలైన మీ అందరి సహకారం అర్థించినది. లోగడ నుంచి యీతాలూకా గ్రంధాలయ సంఘ మహాసభలు జరుపబడుతూనే వున్నవి. ప్రధమంగా 1914 సం॥ మేనెలయందు తెనాలియందు గుంటూరుమండల గ్రంథాలయ ప్రతినిధుల సమావేశ సందర్భమునందు యీ తెనాలితాలూకా గ్రంధాలయ సంఘమును ఏర్పాటు చేయు ప్రయత్నము కార్యరూపము దాల్చినదని తెలియుచున్నది. అప్పుడు యీ సంఘమునకు శ్రీ సత్తెనపల్లి హనుమంతరావుగారు (దుగ్గిరాల) కార్యదర్శిగనూ, శ్రీ అంచే శివయ్యగారు (ఈమని), శ్రీ నూరుగుచ్చి శేషాచలశర్మగారు సహాయ కార్యదర్శులుగనూ ఏర్పాటుగావింపబడిరి. వీరుగాక శ్రీ భాగవతుల సుబ్బయ్యగారున్నూ, శ్రీ హనుమంతరావుగారున్నూ, శ్రీ సూరి వేంకటనరసింహంగారితో కలసి తెనాలితాలూకాలోని అన్ని గ్రామాలు తిరిగి, ప్రారంభ విద్యాసంఘములను స్థాపించుచూ గ్రంథాలయోద్యమ ప్రచారము గావించియుండిరి. కొన్ని గ్రామాలలో

గ్రంథాలయములకు ప్రత్యేక భవనములు ఏర్పడునట్లుగా కూడ కృషి చేసి యుండిరి.

కాని నేడు అవి అన్నియు అలాగే నిలచిపోయి యున్నవి. కొన్నిటిని పంచాయితీలు స్వాధీనము చేసుకొని నిర్వహించుచున్నవి. కొన్నిటిని లోకల్ లైబ్రరీ అధారిటీవారు స్వాధీనం చేసుకొని నిర్వహించుచున్నారు. అయితే నిద్రావస్థలోవున్న వాటి విషయం ఏమిటి? వాటిని అలాగే వదలివేయుటమేనా? గ్రంథ భాండాగారములయొక్క యుపయోగములనుగూర్చి నేను మీ యెదుట నుపన్యసించుట అతి సాహసమే కాగలదు.

గ్రంథాలయోద్యమంలో నిరంతరం పనిచేస్తున్న పెద్దలు, కార్యకర్తలు యిచ్చట ఉన్నారు. నేను సూచించినవాటిపై వారు కొన్ని నిర్ణయాలు చేయగలరని ఆశిస్తాను. సభ నలంకరించిన పెద్ద లందరికి మరొకసారి వందనము లర్పిస్తున్నాను.

సెలవు.



Every man is a volume if you know how to read him.

— *Channing.*

# ప్రారంభోపన్యాసము

శ్రీ శరణు రామస్వామి చౌదరి

పూర్వకాలమున మన భాష, వైజ్ఞానిక, చారిత్రక, రాజకీయ, సాంస్కృతిక విషయములలో భారతజాతి అత్యంత ఔన్నత్యమును పొంది ప్రపంచమునకు ఆదర్శప్రాయమై తనరారెనది. ఆంధ్ర దేశము కూడ 11 వ శతాబ్దమునందు రాజరాజ నరేంద్రుని యాదరణమున గౌతమీతీరమున తెలుగు మహాభారతము శ్రీ నన్నయ మహాకవిచే ప్రారంభింపబడి తరువాత ఎఱ్ఱన, తిక్కన మహాకవులచే పూర్తిగావింప బడి ఆంధ్రభాష దినదినాభివృద్ధిగాంచి ఆంధ్ర దేశము విజ్ఞానాభివృద్ధి గాంచి విలసిల్లినది. ఆంధ్రభాషయందు తదుపరి మహాభాగవతము శ్రీ పోతన మహాకవిచే వ్రాయబడి ఆంధ్రులను భక్తి ప్రపూరితుల గావించెను. ఇంకను పెక్కురు కవులు పలు శాస్త్రములను, ప్రబంధ ములను, కథలను, నాటకములను రచించి ఆంధ్ర సరస్వతీదేవి నలంక రించిరి. తరువాత ఆంధ్రరాజులు తంజావూరు, మధురరాజ్యములు పాలించినపుడు ఆంధ్రభాష ఆ సంస్థానములలోని కవులచే, పండితులచే పెక్కు గ్రంథరాజములు వెలువడినవి. త్యాగరాజు కీర్తనములు అచటనే వెలసి కర్నాటక సంగీతము భారత దేశమున శాశ్వతముగ కీర్తిగాంచుచుండెను. ఎన్ని వందల కవిపుంగవులో ఆ ప్రాంతముల వెలసి ఆంధ్రభాషా దేవిని సేవించి కృతకృత్యులైరి. తంజావూరు సరస్వతీ గ్రంథాలయమందు నేటికిని ప్రచురింపబడని కొన్నివందల తెలుగు గ్రంథరాజము లున్నవి. ప్రత్యేక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము యేర్పడి దిగ్విజయముగ పాలించుచున్నది గనుక ఆ గ్రంథము లన్నియు ప్రచు రించి ఆంధ్ర విజ్ఞానమును పెంపొందించ గోరెదను. తెలుగు సాహిత్య అకాడమీ ఈ విషయమై శ్రద్ధ తీసికొనిన యీపని నెరవేరుట సుసా ధ్యము. గత శతాబ్దమువరకు భారతదేశము అజ్ఞానమున మునిగియే యున్న దనవచ్చును. ఈ యిరువది శతాబ్దముననే భారతమాత తన

నిజస్వరూపమును గుర్తించుకొని తన బిడ్డలను ప్రబోధించి మేల్కొల్పి నది. ప్రథమమున బెంగాల్, మహారాష్ట్ర దేశములు మేల్కొని తమ భాషలను వృద్ధిగావించుకొనిరి. తరువాత ఆంధ్ర దేశమున యుగపురుషు లగు శ్రీ కందుకూరి వీరేశలింగకవి వెలసి జీవచ్ఛవముగనున్న ఆంధ్ర భాషయందు పెక్కు గ్రంథరాజములు ప్రకటించి ఆంధ్రుల నుద్బో ధించిరి. పలు నాటకములు, ప్రబంధములు, నవలలు, కథలు, నీతిబోధలు ప్రకటించి ఆంధ్రులను మేల్కొల్పి మనకు యుగపురుషులై ధన్యులైరి. ఆంధ్ర దేశమునందు రాజకీయముగ, విద్యావేత్తలుగ ప్రముఖులైన శ్రీ కోపల్లె హనుమంతరావుగారు (ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపకులు), శ్రీ ముట్నూరి కృష్ణారావు పంతులుగారు, శ్రీ పట్టాభి సీతారామయ్య పంతులుగారు, శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, పిఠాపురం మహారాజాగారు వారి శిష్యులే. ఈ మహనీయుల కృషివలననే ఆంధ్ర దేశము మేల్కొనినది. అపుడే ఆంధ్ర దేశమున గ్రంథాలయోద్యమము ప్రారంభమై పలు పట్టణములలో, గ్రామములలో గ్రంథాలయములు ఉత్సాహవంతులగు యువకులు స్థాపించి విజ్ఞానాభివృద్ధి గావించిరి.

ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము 1914 సం॥ న విజయవాడలో ద్వితీయ ఆంధ్రమహాసభలు జరుగు శుభసమయమున ప్రథమ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి యాధి పత్యమున జరిగి, శ్రీ సూరి నరసింహం పంతులుగారు అధ్యక్షులుగాను, ఆంధ్ర దేశ గ్రంథాలయోద్యమ జనకులగు శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య పంతులుగారు కార్యదర్శిగను యేర్పడి ఇరువది అయిదు సంవత్సరములు దిగ్విజయముగ సాగి ఆంధ్ర దేశమున మారుమూలల నున్న గ్రామములలోకూడ గ్రంథాలయములు స్థాపించి విజ్ఞానాభివృద్ధి గావించిరి. ఆంధ్ర దేశమున 1906 సంవత్సరము నుండియు రాజకీయ ప్రబోధముగూడ గ్రంథాలయములున్న గ్రామములలోనే యెక్కువగ జరిగి వేలకొలది ఆంధ్రయువకులు కారాగారములకు వెళ్లి స్వాతంత్ర్య యోధులై తమ జీవితముల ధన్యత గావించుకొనిరి.


శ్రీ శరణు రామస్వామి చౌదరిగారు

మన తెనాలి తాలూకాలో గూడ భారతదేశమున కలిగిన నూత్న ప్రబోధము కలిగి ఉత్సాహవంతులగు యువకులు గ్రంథాలయములు స్థాపించ ప్రారంభించిరి. మన తాలూకాలో ప్రథమ గ్రంథాలయము పెదపాలెం గ్రామములో శ్రీ పుతుంబాక సీతారామయ్యగారు, ద్వితీయ గ్రంథాలయము అమృతలూరులో శ్రీ కుడితిపూడి వెంకటరత్నంగారు, తృతీయ గ్రంథాలయము అనంతవరం గ్రామములో శ్రీ కుప్పా శ్రీరామశర్మగారును స్థాపించి తాలూకావాసులలో విజ్ఞానాభివృద్ధిగావించి మార్గదర్శకులైరి. ఇందులో మూడవవారు స్వయముగనే వారి గ్రంథాలయ భవనమునకు, పుస్తకములకు 25 వేల రూప్యములు వెచ్చించి మార్గదర్శకులైరి. ఇప్పటికి దాదాపుగ గ్రంథాలయములేని గ్రామము యీ తాలూకాలో లేదని చెప్పవచ్చును.

తాలూకా గ్రంథాలయ సంఘము 1915 సం॥ న శ్రీ కర్లపాలెం నారాయణప్పగారు అధ్యక్షులుగను, శ్రీ తాడంకి వెంకయ్యగారు కార్యదర్శిగను వుండి యెక్కువ శ్రమచేసి తాలూకాయందు పెక్కు గ్రంథాలయముల స్థాపించిరి. శ్రీ వెంకయ్యగారు తరువాత మనజిల్లా గ్రంథాలయ

సంఘమునుగూడ స్థాపించి కార్యదర్శియై ఎక్కువ కృషిచేసిరి. వీరి తరువాత శ్రీ భాగవతుల సుబ్బరామయ్యగారు అధ్యక్షులుగను, శ్రీ సత్తెనపల్లి హనుమంతరావుగారు కార్యదర్శిగను వుండి ఉత్సాహముగ కృషిచేసి తాలూకాలో నూతన ఉత్సాహమును కలుగజేసి ఆంధ్రులకు మార్గదర్శకులైరి. వీరి హయాములోనే ఎలిమెంటరీపాఠశాల లేని బుర్రిపాలెం గ్రామములో తాలూకా గ్రంథాలయ సంఘ యాజమాన్యమున ఎలిమెంటరీ పాఠశాల స్థాపించి కీర్తిగాంచిరి. తరువాత యీ పాఠశాలను తాలూకాబోర్డువారి కిచ్చిరి. ఈ విధమైన కృషిచేసి ఆంధ్ర దేశమునకు మార్గదర్శకమైనది యీ సంఘమే.

ఇపుడు తాలూకాలో మూడు వందల గ్రంథాలయములకు చక్కని భవనములు గలిగి చిరస్థాయిగ భాషా, విజ్ఞాన సేవలు చేయుచున్నవి. పెదపాలెం ఆర్య బాలసమాజమువారు పెదవడ్లపూడి - కొల్లూరులమధ్య బ్యాంకుకెనాలుమీద బోటుగ్రంథాలయము స్థాపించి ప్రయాణీకులను విద్యాభిలాషులుగజేసి ప్రోత్సహించి భారతదేశమునకు ఆదర్శప్రాయులైరి. అమృతలూరు భాషాసంజీవనీ సంఘమువారు మ్యాజిక్ లాంతరు సంపాదించి గ్రామములలో విజ్ఞానాభివృద్ధి గావించిరి. ఈ విధముగనే తాలూకాలో పలు గ్రంథాలయములవారు మహా పురుషుల జయంతులు, స్వాతంత్ర్యోద్యమ ప్రబోధము గావించి ప్రజలనుత్సాహపరచిరి. అందువలననే గ్రంథాలయోద్యమము ఆంధ్ర దేశమున విశిష్టత పొందెను.

మనదేశము పర ప్రభుత్వములో నున్నపుడు శాసనసభలలో గ్రంథాలయ చట్టము యేర్పరచి విజ్ఞానాభివృద్ధి గావించుటకు తోడ్పడమని శ్రీ దేశభక్తి కొండా వెంకటప్పయ్య పంతులుగారు ఆందోళనము గావించిరి. కాని అప్పటి పరప్రభుత్వమువారు పెడచెవిని బెట్టిరి. కాని ప్రతి సంవత్సరము రాష్ట్రములోని గ్రంథాలయములకు విరాళములిచ్చి కొంత ప్రోత్సహించిరి. మనదేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన

తరువాత మద్రాసు రాష్ట్ర ప్రభుత్వము గ్రంథాలయ చట్టము గావించి 1950 సంవత్సరము నుండియు జిల్లా గ్రంథాలయ అధారిటీలను ఎన్నికద్వారా యేర్పరచి ఉద్యమమునకు ఒకరూపము నిచ్చిరి. అందువలననే ఆంధ్రదేశమున 20 జిల్లాలలోను కేంద్ర గ్రంథాలయములు, గ్రామములలో 300 పైగా బ్రాంచి గ్రంథాలయములు స్థాపించి ప్రజలకు విద్యా సౌకర్యములు కలుగజేసిరి. ఈ గ్రంథాలయములు తగిన సిబ్బందిచే చక్కగ నిర్వహించ బడుచున్నవి. మన తాలూకాలో తెనాలి, అమృతలూరు, పెదరావూరు, ఇంటూరు,



తెలంగాణా ఆంధ్రోద్యమంలోనూ,
గ్రంథాలయోద్యమంలోనూ గురుతర బాధ్యతలు
నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంఘ
అధ్యక్షులు, సౌజన్యమూర్తి
శ్రీ కోదాటి నారాయణరావుగారు

కొలకలూరు, దుగ్గిరాల గ్రామములలో మాత్రము బ్రాంచి గ్రంథాలయములు స్థాపించిరి. ఇంకను పలుగ్రామములలో బ్రాంచిగ్రంథాలయములు, మిగిలిన గ్రామములలో డెలివరీ గ్రంథాలయములు స్థాపించిన గాని ప్రజలకు గ్రంథాలయ సహాయము అందుబాటులో నుండదు. దీనికై జిల్లాగ్రంథాలయ అధారిటి పూనుకొనునటుల చేయుట గ్రంథాలయ సేవకుల విధి. ఇంతేగాక గ్రంథాలయ సేవకులు ప్రజానాయకులు అనుకొనినటుల యీ చట్టము రాకపోవుట విచారకరము. గ్రంథాలయ చట్టము గ్రామములలో స్థాపించియున్న అన్ని గ్రంథాలయములకు తగిన విరాళములను విధిగ నిచ్చునటుల సంస్కరించినగాని ప్రజలందరికి ఉపయోగము, ఉత్సాహము వుండదు. ఆంధ్రదేశమునగల దేశాభి

మానులు, భాషాభిమానులు, గ్రంథాలయ సేవకులు, కృషి చేసి చట్టమును ఈ విధముగ మార్చుటకు వెంటనే కృషి చేయ వేడెదను. ప్రజలందరు గ్రంథాలయ పన్ను విధిగా చెల్లించుచున్నారు కాని యీ పన్ను సక్రమముగ జిల్లా గ్రంథాలయ అధారిటీలకు చేరుట లేదు. ప్రభుత్వమువారికి అనేక పర్యాయములు చెప్పుకొన్నను యింత వరకు శ్రద్ధ తీసికొనలేదు. ఇపుడైనను ప్రభుత్వమువారు శ్రద్ధ తీసికొనెదరుగాక.



విజయవంతంగా నిర్వహించిన ఆంధ్రప్రదేశ గ్రంథాలయసంఘ కార్యదర్శి, కార్యసాధకుడు శ్రీ పాతూరి నాగభూషణముగారు.

గ్రంథాలయ సిబ్బందికి తగిన వేతనములు లేకపోవుట విచారకరము. విద్యాశాఖలో మిగిలిన ఉద్యోగులకు యిచ్చిన సదుపాయములు కలుగజేసి సిబ్బందిని ప్రోత్సహించెదరు గాక. ఇప్పటివరకు లైబ్రేరియనులకు ప్రమోషనులు, తగిన గ్రేడ్‌లు యిచ్చు నిబంధనలు యేర్పరచకపోవుట విచారకరము. తగిన ప్రోత్సాహము లేకపోవుటచే సమర్థులగు లైబ్రేరియనులు ఇతరశాఖలకు వెళ్ళుట ప్రారంభించిరి. అందువలన యీ శాఖ సమర్థవంతముగ పనిచేయజాలదు. కాన వెంటనే ప్రభుత్వమువారు తగిన శ్రద్ధతీసికొని యీ యుద్యమము దినదినాభివృద్ధి గావించెదరు గాక. జిల్లాల అధారిటీల సంఘములు ప్రతి సంవత్సరము విరివిగ మంచి గ్రంథములు, పత్రికలు గ్రంథాలయములకు పంపి ప్రజలను విద్యాభిమానులుగ, విజ్ఞానాభిమానులుగజేసి దేశము ముందడుగు వేయునటుల గావించి తమ కీర్తిచంద్రికలు శాశ్వితముగ వ్యాపింపజేసికొని ధన్యులయ్యెదరు గాక.

# అధ్యక్షోపన్యాసము

శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యా

## ఉద్యమ స్వరూపము :

ఉద్యమములలోకెల్ల మూలకందమైనది, ఉద్యమములకెల్ల జీవదాయకమైనది, జ్ఞానదాయకమైనది గ్రంథాలయోద్యమము. 'స్వయంతీర్ణః పరాంస్తారయతి' తాను బాగుపడి ఇతరులను బాగుచేయవలయునను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛయే ఈ యుద్యమ ప్రేరణశక్తి. ఆంధ్రదేశము నలుమూలల వ్యాపించియున్న నవోత్సాహపూరితులైన యువకులే ఈ యుద్యమమునకు పూజారులు.

దేవాలయ ధర్మకర్తలును పూజారులును జీవితాదర్శముల కొరకు దేశకళ్యాణముకొరకు తమ జీవితములను ధారపోయు త్యాగమూర్తులుగ నుండెడివారు. నేటి గ్రంథభాండాగారులు కూడ అట్టి ఆదర్శములను కలిగినవారుగనే యుండవలయును.

గ్రంథాలయమునకు దేవాలయమునకు అభేదము. దేవాలయము లన్నియు గ్రంథాలయములే. గ్రంథాలయము లన్నియు వాగ్దేవతాలయములే, భారతీ సదనములే. ఈ రెంటికిని గల ద్వంద్వమును పోగొట్టి ఏకత్వమును సాధింపవలెను.

## ఆంధ్రదేశము – నవీన గ్రంథాలయోద్యమము :

నవీన గ్రంథాలయోద్యమమునకు బీజములు 1886 సం. లోనే అంకురించినవి; అయినను 1914 సం. న ఆంధ్రగ్రంథాలయ సంఘము స్థాపింపబడి అప్పటినుండియు అది యొక ఉద్యమరూపము దాల్చినది. ఆంధ్రగ్రంథాలయము లన్నియు

ఆంధ్రోద్యమమునకు ఆంధ్రవికాసమునకు జీవగర్రలై, ప్రధాన ప్రచార శాఖలుగా రూపొందినవి; మరియు 1917 సం. న. అనీబిసెంటుగారి హోంరూలు ఉద్యమమునకును, 1923 సం. న గాంధీమహాత్ముని అసహాయోద్యమమునకును- మన గ్రంథాలయము లన్నియు అమితోత్సాహముతో కృషిచేసి విజృంభించినవి.

## జ్ఞాన తృష్ణ - తరిబీతు :

దేశముయొక్క నలుమూలల విజ్ఞాన పిపాస యెక్కువైనది; వివిధ విషయములను గూర్చిన గ్రంథముల కరువు స్పష్టముగ కనుపించినది. గ్రంథాలయ నిర్వహణము పరిపాలన కూడ శాస్త్రీయ దృక్పథముతో సమీకరణము చేయవలసిన పరిస్థితులు ఆవిర్భవించినవి. అందుచేత 1924 సం. నుండియు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమును, ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘమును గూడ పలు స్థలములందు శిబిరముల నేర్పాటుజేసి, తగు శిక్షణల నిచ్చినవి.

## ప్రభుత్వముయొక్క సహాయము :

ప్రజలు ఎంత గ్రంథాలయోద్యమమునకు ప్రచారముచేసి, వానిని స్థాపించి వ్యాపింపజేసినను - ప్రభుత్వమువారి సహాయము ఉండిన యెడల సర్వతోముఖమైన అభివృద్ధి జరుగగలదని భావించితిమి. కొంత ప్రచారము జరిగిన పిమ్మట దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు మద్రాసు లెజిస్లేటివు అసెంబ్లీయందు కొన్ని సంవత్సరములు కృషిచేసి, ప్రభుత్వమువారినుండి ఏటేట కొంత సహాయమును గ్రంథాలయములకు సాధించిరి; అది అవగింజలో అరభాగమైన గాకుండెను.

## గ్రంథాలయ చట్టము - దాని లోటుబొట్లు :

అట్టి స్థితిలో మన దేశమునందుకూడ - పాశ్చాత్యదేశములందువలె సార్వజనిక గ్రంథాలయోద్యమ పరిపాలన కొరకు ప్రత్యేకమైన చట్ట ముండిన బాగుండుననియు అందువలన ఈ యుద్యమ పురోభివృద్ధి మహోజ్వలమై వెలుగగలదని భావించితిమి. 1933 సం. నుండి చేసిన వివిధ ప్రయత్నముల ఫలముగ 1948 సం. న మద్రాసు గ్రంథాలయ చట్టము ఆవిర్భవించినది.

కాని దాని రూపము - ఫలితము మన మాసించిన దానికంటె వేరయ్యెను.

దేశమునందు అంతవరకు ప్రజ్వలితమైన గ్రంథాలయోద్యమము యొక్క ప్రసవంతిగా ఈ గ్రంథాలయ శాసనము రూపొందలేదు; ఈ చట్టము ఏర్పడు నప్పటికి అమలులోనున్న గ్రంథాలయోద్యమము యొక్క చరిత్రనుగాని అనుభవములనుగాని ఈ శాసనకర్తలు ఎంతమాత్రము గమనికలోనికి దీసికొనక పోవుటయే గాక - వానిని నిర్లక్ష్యముగూడ జేసిరి.



గ్రంథాలయ పితామహులు
శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు.

సుప్రసిద్ధ విజ్ఞానవేత్త - సహకారోద్యమ నాయకులు - శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు చెప్పినటుల, మొత్తముమీద ఈ చట్టమువలన కలుగు లాభముకన్న నష్టములును - ఉత్త నష్టములేగాక - అనర్థకములును ఎక్కువగా నున్నవని ఊహించితిమి.

పిమ్మట హైద్రాబాదు రాజ్యమున కొక గ్రంథాలయ చట్టము చేయబడినది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఏర్పడిన పిమ్మట ఈ రెండు చట్టములను సమీకరించి ఒక కొత్తచట్టమును 1960 సం. న రూపొందించిరి. ఈ కొత్త చట్టమునందు అనేక మార్పులు చేయబడినవి. ప్రతి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీయందును ప్రజాసంస్థయగు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు రెండు స్థానముల నిచ్చిరి.

అయినప్పటికి గ్రంథాలయ చట్టమునందు అసలు ఉద్భవించిన లోట్లు యథాతథముగానే యున్నవి.

## ఉన్నస్థితి - జరుగవలసిన మార్పులు :

### లోకల్ లైబ్రరీ అథారిటీ

జిల్లా కొక లోకల్ లైబ్రరీ అథారిటీ; దాని కొక కేంద్ర గ్రంథాలయము; కొన్ని శాఖలు ఏర్పరచినారు.

నమూనాకు కృష్ణాజిల్లాను దీసికొందము; ఈ జిల్లాయందు రమారమి ఒక వెయ్యి గ్రామములు గలవు; ఆంధ్రదేశమునందెల్ల ఎక్కువ శాఖాగ్రంథాలయములు గల ఈ జిల్లాను లెక్కజూచుకొనగా ఇదివరకున్న శాఖలు 43; ఈసంవత్సరము పెట్టనున్నవి 13. ఈ రెండు కలుపుకొంటే 56 శాఖలు; వీనికి తోడు స్థాపింపదలచిన బుక్ డిపాజిట్ సెంటరులు 50; వెరశి వెయ్యి గ్రామములలో 56 + 50 గ్రామములకు గ్రంథాలయ సేవ (ఆదర్శముగా గాకపోయినను ఒక మోస్తరుగానైన) ఇవ్వగలరన్నమాట. ఈ శాఖా గ్రంథాలయ నిర్వాహణమునందు గాని, వాని పరిపాలనాదక్షతయందుగాని - గ్రామస్థుల కెట్టి సంబంధము లేదు. సహకార సంఘముల యందువలె గ్రామస్థులకు సంబంధముండుట అత్యంతావశ్యకము. అయితే జిల్లాలోగల మిగిలిన 900 గ్రామముల గతియేమి ?

ఇప్పటికీ జిల్లాకేంద్ర గ్రంథాలయంయొక్క ఖర్చు కలుపుకొని వీనికి షుమారు అయిదు లక్షల రూపాయిలు వ్యయమగుచున్నది. ప్రతి గ్రంథాలయానికి తరిబీదు పొందిన గ్రంథ భాండాగారి, అటెండరు, వాచిమన్ కొన్నింటికి మాత్రం ప్రత్యేకం బంట్రోతు - ఈరీతిగా ఒక్కొక్క బ్రాంచి లైబ్రరీకి షుమారు రు. 3000 లు ఖర్చు అగుచున్నది.



ఆంధ్రప్రదేశ్‌లోని స్థానిక గ్రంథాలయసంస్థలలో, అభివృద్ధి లోనూ, సాంకేతికంగానూ తలమానికంగా గుంటూరుజిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థను నిర్వహించుతున్న అధ్యక్షులు, కార్యదక్షులు
శ్రీ కొత్తపల్లి ఉమామహేశ్వరరావుగారు.

కమిటీ గ్రంథాలయముయొక్క దీనస్థితి :

కడచిన 60 సంవత్సరములనుండి దేశసౌభాగ్యమునకు, గ్రామ జీవనోత్తేజమునకు, సంస్కృతికి పునాదులువేసి రాజకీయ చైతన్యమును ప్రజలయందు గలుగజేసి, "గాంధి రాజ్యపు మునసబుగాగాని, కరణముగాగాని మారిన అధ్యక్షుడు, కార్యదర్శి" గల (ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు 1924 సం. న ఆంధ్ర దేశ గ్రంథాలయసభకు అధ్యక్షతవహించి చెప్పిన వాక్యములు) "కమిటీ" పరిపాలన క్రిందయున్న వేలకొలది గ్రామ పట్టణ గ్రంథాలయములకు ఈ లోకల్ లైబ్రరీ అథారిటీయొక్క పరిపాలనలో గాని, నిర్వహణలోగాని, ద్రవ్య సహాయంలోగాని స్థానము లేకపోవుట మిక్కిలి శోచనీయము. అయితే ఈ కమిటీ గ్రంథాలయములలో అల్ప సంఖ్యకు మాత్రము ప్రభుత్వమువారు తమ - పాత-మామూలు ధోరణిలో - అవి చావకుండ, బ్రతకకుండ స్వల్ప మనోవర్తులను మాత్రము ఇచ్చుచున్నారు.

గ్రంథాలయ చట్టమును ప్రత్యేకము ఏర్పాటుచేసి అందుకై ప్రత్యేకము పన్నులను వసూలు జేసి, ఆ పన్నుల పరిపాలనకై ప్రత్యేకముగా లోకల్ లైబ్రరీ

అధారిటీలను గ్రంథాలయోద్యమ వ్యాప్తికై ఏర్పాటు జేసినప్పుడు - "కమిటీ" గ్రంథాలయములకు వేరే చందాలను ఎట్లు యిత్తుమని దాతలు అడుగుచున్నారు.

అందుచేత "కమిటీ" గ్రంథాలయములకు దాతలు మునుపటివలె విరాళముల నిచ్చుటలేదు - లోకల్ లైబ్రరీ అథారిటీలు ద్రవ్యసహాయంగాని గ్రంథసహాయం గాని చేయుటకు సావకాశంలేదు.

## లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏమి చేయాలి ?

లోకల్ లైబ్రరీ అథారిటీలు జిల్లా కొక ప్రశస్తమైన కేంద్రగ్రంథాలయమును నడుపుచు, తాలూకా కొక బ్రాంచిని నడపి ఈ కేంద్ర, తాలూకా, గ్రంథాలయాల ద్వారా - గ్రామ పట్టణ "కమిటీ" గ్రంథాలయాలకు పుస్తక సంచయమును అంద జేయుచు, అట్టివానికి సిబ్బందీఖర్చులకై సాలు 1కి పెద్దవానికి ఒక వెయ్యి రూపాయిలును, చిన్నవానికి రు. 500లును ద్రవ్యరూపమున ఇచ్చుచుండవలెను; అట్టి శ్రమ గ్రంథ భాండాగారికులకు (ఇంగ్లీషు చదువుకోని వారైనా సరే) కేంద్ర గ్రంథాలయంగాని,ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం గాని తగుమాత్రపు శిక్షణ నిచ్చిన చాలును; ఎందుచేతననగా వర్గీకరణ, చీట్లు అంటించుట మొదలగుపనులు యావత్తు కేంద్ర గ్రంథాలయమందే జరుగ గలవు.

అట్టి స్థితియందు ఇప్పుడు పైన చెప్పిన కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ ఖర్చు పెట్టుచుండిన ద్రవ్యముతో జిల్లాలోగల సగము గ్రామములకు కేంద్ర గ్రంథాలయమునుండి తాలూకా గ్రంథాలయములనుండి గ్రంథాలయ సేవను అందజేయ గలమని నా మనవి. కోస్తా జిల్లాలో గల లోకల్ లైబ్రరీ అధారిటీల కొన్నిటికి ఈ సూచనలు చెల్లుతవి.

అట్లు అవలంబించే యెడల - పాత గ్రంథాలయోద్యమము చేసిన సేవా ఫలితములు - "కమిటీ" గ్రంథాలయముల ద్వారా - పది సంవత్సరముల కాలములో రాష్ట్రమం దంతటను, పడుగు - పేకగా - అల్లుకొనగలవు.

## ఆశీర్వాదము :

సమస్త పుస్తకముల యొక్క స్వరూపమును ధరించి, పుస్తకమును చేత ధరించి, వీణను మీటు - సకల వేదశాస్త్ర సరస సాహిత్య సంగీతమున కధి దైవత మగు లోకజనని - పరాశక్తి - సరస్వతీదేవి ప్రసాదము మీకు సదా లభించునుగాక.

# మేలుకొలుపు

శ్రీ యస్. యస్. రాజశేఖరం

మేలుకోరా తండ్రి – మేలుకోరా !
ఏలుకో నీభూమి – నేలుకోరా ॥
కేలమీటిన వీణ కిణకిణ మ్రోగ గ్రం
థాలయమ్మున వాణి – మేలుకొల్పులు పాడె మేలుకో ॥

వేదాలు పండిన – భరతఖండములో
భూదేవి చదువుకే – పేదయై పోయె !
రతనాలు మొలచిన – రామ రాజ్యములో
రాగిసంకటి కింత – రచ్చయైపోయె ! ॥మేలుకో॥

లోక సుమముల అ – శోకవనమునకు
రాకాసి తాండవమె – రక్షయైపోయె !
కల్లకపట మెరుగని – గ్రామ సుందరికి
కపట నాటకమె శృం – గారమైపోయె. ॥మేలుకో॥

స్వేచ్ఛైక జీవుల – స్వర్గవాసములో
స్వాతంత్ర్య వాయువులె – సన్నగిలిపోయె
తత్త్వమూర్తులుగన్న – ధ్యాన మందిరములో
తారతమ్యపు దుమ్ము – పేరుకొనిపోయె. ॥మేలుకో॥

పారతంత్ర్యపు టిరులు – పడమటగ నడిచె !
తూరుపున స్వాతంత్ర్య – భాను డుదయించె
పీడకలల యుగము – దాటిపోయెనురా
నేడు నీ యింటిలో – నీవె రాజువురా. ॥మేలుకో॥

# తెనుగు తనం వెలార్చే తెనాలి నగరం

శ్రీ వి. శ్రీరామచంద్ర, బి.ఏ.

ఆసేతు హిమాచలమూ 'తెలుగువాడు' అంటే కొన్ని ప్రత్యేక లక్షణాలు అందరికీ స్ఫురిస్తాయి. భౌగోళికంగాను సాంస్కృతికంగాను ఆంధ్రదేశం ఉత్తర దక్షిణ భారతా లనే అగాధాలమీద వారథిగా నిలిచి ఉన్నది. మంచిగాని, చెడుగాని, ఏదైనా ఇతరులనుంచి స్వీకరించాలంటే, మనదేశంలో బెంగాలీబాబులుగాని, తెలుగువాళ్ళుగాని ముందంజవేస్తారని ఒకప్రథ. తెలుగువారి రాసిక్యంగాని, విద్యా బుద్ధులుగాని, భోగభాగ్యాలుగాని నిండుగా కానవచ్చేది గుంటూరు మండలంలోనే అంటే తప్పుకాదేమో! అటువంటి గుంటూరు మండలంలో, ముఖ్యపట్టణమయిన గుంటూరు తర్వాత సకల విధముల ప్రముఖస్థానాన్ని అలంకరించేది తెనాలి.

తెనాలి, మద్రాసు - ఢిల్లీ (కలకత్తా)లకు పోయే ప్రధాన రైలుమార్గం మీద ఉన్నది. ఇది గుంటూరుకు తూరుపుగా సుమారు పదునారుమైళ్ళ దూరంలో, కృష్ణా తీరానికి పన్నెండుమైళ్లు పడమటగా నిలిచి ఉన్నది.

## చారిత్రక ప్రశస్తి

భారతదేశ జీవనదులలో ఒకటయిన కృష్ణ, మున్నంగి గ్రామంవద్ద పాయగా చీలి తెనాలి, రేపల్లెలగుండా ప్రవహించి, దిండి అడవులదీవి మధ్య బంగాళాఖాతంలో ప్రవేశించినట్లు ఒక ప్రశస్తి ఉన్నది. ఈ ప్రవాహపు చిహ్నాలు ఇప్పటికీ తెనాలి, రేపల్లె తాలూకాలలోని కొన్ని గ్రామాలలో కనిపిస్తున్నాయి. పైగా 1894, 1912, 1914, 1916 సంవత్సరాలలో కృష్ణానదికి భీభత్సమైన వరదలు వచ్చినప్పుడు మున్నంగి గ్రామం వద్దనే "కట్ట" తెగడం, ఈ రీతిగా ఊహించ డానికి ఆధారమవుతున్నది. ఏత దుపనదీ తీరాన "పంచావళీ క్షేత్రాలు" అనుపేర ప్రసిద్ధికెక్కిన అయిదు పుణ్యస్థలాలు విరాజిల్లినట్లు ద్యోతకమవుతుంది. చావలి గ్రామ శివాలయంలో దక్షిణ ద్వారానికి కుడివైపు నున్న శిలా శాసనంపై ఈ విషయం స్పష్టంగా చెక్కబడి ఉన్నది. ఈ క్షేత్రాలలోని ముఖ్య అధిదేవత



విశాలాంధ్రావనిని నవచైతన్యంతో ముంచెత్తించిన కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, తెనాలి పురపాలక సంఘానికి దశాబ్దంపాటు అధ్యక్షులుగా పనిచేశారు.

నామధేయము వాలేశ్వరస్వామి. ఈ శాసనంలో ఉపయుక్తమయిన భాష తెలుగే అయినప్పటికీ లిపి మాత్రం ప్రాచీనరీతిని పోలి ఉన్నది. అందు, చదువగలిగినంతవరకు చావలి, పెరవలి, తెరవలి అను మూడు, పంచావళీ క్షేత్రాలలోనివని తెలుస్తున్నది. మిగిలిన రెండు స్థలాలను వెలిదీయడం సాధ్యం కాలేదు. పై 'తెరవలి' గ్రామమే తెనాలి అని ఇంకొకభావం వ్యాప్తిలో ఉన్నది. ఏమయినప్పటికీ ఈ విషయంపైన సమగ్రపరిశోధన చాల అవసరం.

తెనాలి పట్టణం ఎప్పుడు నిర్మితమయినదో నిర్ధారించడానికి ఎటువంటి చారిత్రికాధారాలు లభ్యం కాలేదు. పదిహేనవ శతాబ్దానికి పూర్వం ఉద్భవించిన శాసనాలలో కాని, కావ్యాలలో గాని వ్యక్తి నామధేయాలలలో గాని తెనాలిపేరు లభించలేదు. అంతమాత్రముచేత ఏతత్పూర్వపు తెనాలి ఉనికినే శంకించడానికి వీలులేదు. క్రీ. శ. 3వ శతాబ్దికి ముందే తెనాలి కొంత సాంస్కృతిక ప్రాముఖ్యాన్ని గడించుకొన్నదన్న విషయం కొన్ని అంశాలమూలాన తేటతెల్లమవుతుంది. వైదికమత సిద్ధాంతాలు వెఱ్ఱితలలువేసి విపరీత వ్యాఖ్యానాలకు త్రోవ తీసినపుడు బౌద్ధమతం ప్రభవించి ప్రజాభిమానాన్ని సంపాదించి ప్రపంచ పరివ్యాప్తమయిన విషయం సర్వులకూ విదితమే. వైదికమతం ఎక్కడ విరివిగా అనుసరింపబడుతున్నదో అచ్చటనే బౌద్ధులు తమ చైత్యాలు, విహారాలు, స్తూపాలు నిర్మించి ఆ యా రాజులను నయాన, భయాన తమవైపు మరల్చుకొన్నారు. తెనాలిలోని రామలింగేశ్వరస్వామి ఆలయములో ప్రతిష్ఠితమయిన బుద్ధవిగ్రహం ఈ నగర వైశిష్ట్యానికి ప్రబల తార్కాణం. ఈ విగ్రహం స్థాపింపబడిన కాలం క్రీ. శ. 3వ

శతాబ్దికి పూర్వమే అయి ఉండాలని, మూడవ శతాబ్దినాటికే బౌద్ధం క్షీణదశకు వచ్చి నశించిపోవడమే దీనికి కారణమని అనేకుల ఊహ.

తెనాలి ప్రశంస, ప్రాయశః ప్రథమంగా ఈ క్రింది శ్లోకంలో రూపొందింప బడిందని తెలుస్తున్నది. ఈ శ్లోకంలో పూర్వార్థం రామలింగేశ్వరస్వామి ఉత్సవ విగ్రహాలలో ఒకదాని ఎడమకాలిపైన, ఉత్తరార్థం రెండవవిగ్రహపు కుడికాలి పైనను చెక్కబడినది.

శ్రీ తెనాలి నగరేవ్య రాజయత్
గార్లపాడు పురరామ పండితః
శుక్ల మాఘసిత పంచమీగురౌ,
రామలింగ మము యోత్సవా కృతిమ్॥

గార్లపాడుకు చెందిన 'రామపండితుడు' శుక్లనామ సంవత్సర మాఘశుద్ధ పంచమీ గురువారంనాడు శివుని ఉత్సవ విగ్రహములను బహూకరించినట్లు ఈ శ్లోకం వలన తెలుస్తున్నది. అయితే ఈ శ్లోకం యొక్క రెండు భాగాల సంబంధం శంకా స్పదమని కొందఱి మతం. అసలు ఉత్సవ విగ్రహాలు రెండు ఒకప్పుడు అప హృతాలయ్యాయని వానిలో ఒకటి మాత్రమే కృష్ణానదీ సికతాతలమునుండి పునరుద్ధ రింపబడిందని ఈ దేవాలయ అర్చకులు వెల్లడించిన సంగతి. ఆ రెండవ విగ్ర హాన్ని మరల తయారుచేసి అమర్చుటవలన మూలశ్లోకంలో మార్పు అత్యంత సంభవ మని వీరు నమ్మిన విషయం. ఇది చాలావరకు సమంజసంగానే తోస్తుంది. ఈ శ్లోకంలో పేర్కొనబడిన రామపండితుడే తెనాలి రామలింగమని ఇచ్చటి ప్రజల సాంప్రదాయసిద్ధ విశ్వాసము. ఈ రామలింగని తండ్రిపేరు రామయ్య లేక రామన్న; తల్లి లక్ష్మమ్మ. అందుచేత పై శ్లోకంలోని రామపండితుడు తెనాలి రామలింగమా లేక అతని తండ్రయిన రామయ్యా అని అనుమానించవలసిని అగత్యం ఏర్పడుతున్నది. ప్రౌఢకావ్యమైన "పాండురంగ మహాత్మ్యము" లో రచయిత అగు రామలింగడు తనను తెనాలి అధిపతిగాను, రామకృష్ణుడు అను పేరుగలవానిగాను పరిచయం చేసు కొన్నాడు, (చూడండి॥ పాండురంగ మహాత్మ్యం - ప్రథమాశ్వాసం ప॥ 22-27)

తే॥ గీ॥ "ఆంధ్రభూమీ కుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నిక్షేతవగ్రి
శాఖికా కోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ రామయరావుకృష్ణ॥"

> మంచి పుస్తకములు దగ్గర ఉన్నయెడల, మనకు మంచి మిత్రులు లేనిలోటు కనిపించదు. పుస్తకాధ్యయనము చేయుచున్నకొలది వాటి విశేషములు తెలియుచున్నవి. గ్రంథ పఠనాభిరుచికలవా రెచ్చటనున్నను సుఖముగా నివసించగలరు.
>
> — మహాత్మాగాంధి

అని తనను 'విరూరి వేద్రాద్రి' సంబోధించినట్లు రామలింగము వ్రాసికొన్నాడు. ఈ రామలింగ (కృష్ణు) నివే ఇంతకంటె పూర్వపు కృతులయిన ఉద్భటారాధ్య చరిత్రాదులలో స్పష్టముగా 'రామలింగ మని' పేర్కొనబడినది. కాని పాండురంగ మాహాత్మ్యము ఉద్భటారాధ్య చరిత్రలలో వివరింపబడిన గురువులు భిన్నులు. దీనినిబట్టి ఈతడు మొదట శైవుడుగానుండి కారణాంతరాలవలన మరొక గురువు దగ్గర వైష్ణవ దీక్ష స్వీకరించినట్లు నిర్ణయింపవచ్చును. ఘటికాచల మాహాత్మ్యము, కందర్పకేతు విలాసము, హరిలీలా విలాసము, అనునవి రామకృష్ణుని ఇతర రచనలని విశ్వసింపబడుతున్నాయి. కాని చివరి రెండూ అలభ్యములే. కేవలము, వానిని గూర్చిన ప్రశంస వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్య మణిమంజరి, ప్రబంధ రత్నావళులలో కనిపించుచున్నది. రామకృష్ణుని వంశములోని వారందరూ అంతో ఇంతో కవితాకన్య నలంకరించినవారే. ఈతని సోదరులు, ఒక సోదరుని కుమారుడు, స్వంత అల్లుడు మంచి కవులు. అగ్రసోదరుడయిన అన్నయామాత్యుడు సుదక్షిణా పరిణయము, ఆయన కుమారుడు రామభద్రకవి ఇందుమతీ పరిణయము, రామకృష్ణుని అల్లుడు లింగమగుంట రామకవి ఆనందకర్ణ మాహాత్మ్యము అను గ్రంథాల రచనలమూలంగా ప్రసిద్ధు లయినారు. ఇంతకూ తెనాలి రామకవి కాల నిర్ణయాన్నిగురించి అనేక వాదోపవాదా లున్నాయి. 1482 వ సంవత్సరములో ఈతండు జన్మించాడని, కృష్ణదేవరాయాస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడని, కృష్ణదేవరాయల తరువాతివాడని వేరువేరు సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి.

గార్లపాడు, లింగమగుంట్ల అనునవి నేటి సత్తెనపల్లి తాలూకాలోని రెండు గ్రామాలు. ఈ కవుల వంశీయు లీనాటికీ ఆ గ్రామములో నివసిస్తున్నారు. గార్లపాడు గ్రామం లక్కరాజు గార్లపాడు అనికూడా పిలువబడుతున్నది.

కవిగా తెనాలి రామకృష్ణునికి ఆంధ్రసాహిత్యంలో ఒక ఉత్తమ స్థానాన్ని ఈయవచ్చును. రసానుభూతి చిప్పిలజేయుటలో అతనికి సాటియైనవారిని వ్రేళ్ళమీద

లెక్కించవచ్చును. నిత్యజీవితంలో వికటకవిగా ప్రసిద్ధి పొందినా, రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యరచనలో ఎక్కడా అట్టి భావాలు కానరావు సరిగదా ఆంధ్ర పంచ కావ్యాలలో అది మిక్కిలి ప్రౌఢమయినదిగా వన్నెకెక్కినది.

* * * *

సంస్కృత సాహిత్యంలో కించిత్ప్రవేశం ఉన్నవా రెవరికైనా జగన్నాథ పండితరాయని పేరు తెలియకపోదు. ఆయన ఆంధ్రుడని అంతకంటె ముందుగానే తెలిసుంటుంది. ఈ జగన్నాథ రచితములయిన రస గంగాధరము, భామినీ విలాసము, గంగాలహరి అను కావ్యాలను భారతదేశంలోని పండితులు అత్యంతాసక్తితో పఠిస్తుంటారు. ఈయన 17వ శతాబ్దికి చెందినవాడు. మొగలు పాదుషా లయిన జహంగీరు షాజహానుల ఆస్థానకవి. పండితరాయని జన్మస్థలాన్ని గురించి ఒక చిన్న వివాద మున్నది. ఈయన గోదావరిజిల్లాలోని అమలాపురం తాలూకా ప్రాంతం వాడని మంత్రవాది సూర్యనారాయణశాస్త్రిగారు ప్రభృతులు ప్రవచించారు. కాని ఇది సరికాదు. జగన్నాథుడు వేగినాటి శాఖకు చెందిన ఉపద్రష్టవారి కుటుంబంలో జననమందాడు. ఈ ఉపద్రష్టవారు తెనాలి తాలూకాకు చెందిన 'పాటుమర్రు' తదితర అగ్రహారాలలో నేటికీ నివసిస్తున్నారు. జగన్నాథుని సోదరుడయిన రామచంద్రభట్టుకు గోల్కొండ నవాబయిన కుతుబ్‌షా దావులూరు అను అగ్రహారాన్ని బహూకరించినట్లు దానశాసనము వెల్లడిస్తున్నది. ఇప్పుడు కోనసీమలో నివాస మేర్పరచుకొన్న ఉపద్రష్టవారి కుటుంబాలు ఒకప్పుడు తెనాలి పరిసరాలనుంచి వలసవెళ్ళినవే నని వృద్ధుల అభిప్రాయం.

* * * *

తెనాలి తదనంతర చరిత్ర రెండు కుటుంబాలచుట్టూ అల్లుకొన్నది. అవి పిల్లలమర్రి, మతుకుమల్లివారి వంశాలు. పిల్లలమర్రివారి వైదిక సంస్కృతికి విద్యాపారంగత్వానికి ప్రతిగా పులిచింతల, మల్కాపురం అను రెండగ్రహారాలు బహూకరింపబడ్డాయి. వారి వంశంలోని పండితులలో చివరితరంవాడు పూర్ణయ్య సిద్ధాంతి. ఆగమసాహిత్యంలోను, ఖగోళశాస్త్రంలోను ఆయన నిజంగా పరిపూర్ణుడే. సూర్యసిద్ధాంతం ప్రకారం గుణించిన గ్రహాల సంచారమార్గాలు, పరిశీలన వలన నిర్ణయింపబడిన మార్గాలకంటె భిన్నములు. ఈ రెండు విరుద్ధ భావాలను ఆయన సమన్వయపరిచారని ప్రశస్తి.



పురపాలక సంఘాధ్యక్షులుగా తెనాలిని అందాల నగరంగా తీర్చిదిద్దటానికి రూపకల్పనచేసిన నేటి పురపాలక శాఖామాత్యులు
శ్రీ ఆలపాటి వెంకట్రామయ్యగారు

మతుకుమల్లి వారి కుటుంబములో వాసిగాంచిన విద్వత్కవులు, వేదాంతులు, పరిపాలనా దక్షులు జన్మించారు. నెల్లూరు మండలంలో కొంతభాగం పరిపాలించిన బల్లైరాయణంవద్ద అమాత్యుడుగానుండిన వెంగలమయ్య, ఈ వంశములోనివాడే. ఈయన పుత్రుడు నరసింహాస్వామి చతుష్షష్ఠికళలలో ప్రావీణ్యం సంపాదించినట్లు తెలుస్తున్నది. మాధవామాత్యులనుపేర బరగిన వేరొకరు అనంతభట్టుని చంపూ భారతాన్ని తెనుగులో అభినవభారత మనుపేర పరివర్తన చేశారు. ఈ వంశములోనివారే కనకామాత్యు వి పుత్రులు, నరసింహంగారు ధరణికోట సంస్థానాధీశులు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయనింగారివద్ద దివానుగా నున్నారు. చిన నరసింహం అనువారు దశావతార చరిత్రను లిఖించారు. వీరి మనుమలైన నరసింహ శాస్త్రిగారు కృష్ణామండలములోని తోట్లవల్లూరు సంస్థానాధీశులకడ ఆస్థానకవులుగ నుండి అనేక గ్రంథాలకు కర్తృత్వం వహించారు. వాటిలో అజచరిత్ర శ్లేషయందు వసుచరిత్రను తలదన్నేదిగా నున్నది. ఇంకొకటి వ్యంగ్యకావ్యమైన చెన్నపురీ విలాసము.

* * * *

చలనశీలమైన కాలం తనతోపాటు అనేక అనూహ్య పరిణామాలను కొని వచ్చి వాటి ముద్రలను చిహ్నలను సమాజంమీద విడిచిపెడుతుంది. భారతదేశం అనేక శతాబ్దాల తరబడిగా రాజకీయకంగా ముస్లిముల పరిపాలనకు లోబడింది;

ఆకాలంలోనే సాంస్కృతికంగా కూడా వారిచేత ప్రభావితమైంది. తరువాత పాశ్చాత్యుల అధికారం అవతరించింది. ఆంగ్లవిద్య విరివిగా ప్రాచుర్యం పొందింది; ఆంగ్లసాహిత్యం దేశీయభాషా సాహిత్యాలలో అనేక నూతన ప్రక్రియావలంబనకు ఆధారభూతమయింది. దానితో ప్రజావాహినిలో జాతీయభావం వెల్లివిరిసి పాశ్చాత్యులను మాతృభూమినుండి వెడలనడపాలనే వాంఛ ప్రగాఢమైంది. అదే భారత దేశ స్వాతంత్ర్యోద్యమానికి మూలబీజం. రాజకీయంగా యావద్భారత దేశంలోను జన్మించిన ఉద్యమాలన్నింటిలో చరిత్ర కందినంతవరకు ఇదే ప్రముఖమయినది.

దేశంలోని వివిధ జాతులు, పట్టణాల జనులవలెనే, బహుశ వారికంటె మిన్నగానే తెనాలిపౌరులు జాతీయోద్యమానికి ప్రతిస్పందించి ఏతన్నిర్వహణకు తమశక్తి యుక్తులన్నీ ధారపోశారు. వారు వేల సంఖ్యలో గాంధీమహాత్ముని సామూహిక సత్యాగ్రహాలలో పాల్గొని ప్రభుత్వంవారి కన్నెర్రకు గురి అయినారు. 1927 లో సైమను కమీషను భారతదేశం వచ్చినప్పుడు నిరసన సూచకంగా నల్లజెండాలు ధరించి స్టేషనులో "సైమను కమీషను తిరిగిపో" అని "సైమన్"ను బెదరగొట్టి తెనాలిలో ఆగకుండాచేశా రానాటి ప్రజలు - శాంతియుత విధానాల ద్వారానే స్వరాజ్యాన్ని సంపాదించాలి అనే గాంధీ సూత్రాన్ని ఆమోదించా రెక్కడ; మరికొందఱు విప్లవాత్మక చర్యలనే అవలంబించాలని ప్రబోధించారు. ఒకానొకప్పుడు మద్రాసు గవర్నరుగారు ప్రయాణం చేస్తున్న రైలును బ్రద్దలు చేయాలనే ప్రయత్నాలు కూడా ఇక్కడ సాగినట్లు కొందరు చెబుతారు.

ఇంతలో 1931 వ సంవత్సరం రానేవచ్చింది. అంతకుపూర్వం దేశంలోని రాజకీయనాయకులందఱు జైళ్ళలో మ్రగ్గుతున్నారు. పరిస్థితంతా అల్లకల్లోలంగా ఉన్నది. అప్పటి రాజప్రతినిధి ఇర్విన్ప్రభువు, గాంధీ ఇరువురు తెనాలిలో సమావేశమయినారు, తరువాత ఒడంబడిక జరిగింది. ఇచ్చట వారిరువురి పేర "గాంధీ-ఇర్విన్" పార్కు నిర్మింపబడింది. 1942 ఆగష్టులో దేశమంతటా విప్లవం చెలరేగింది. శాంతిమార్గాలవలన ప్రయోజనంలేదని నిశ్చయించి ప్రజలందరూ దౌర్జన్య చర్యలకు పూనుకొన్నారు. తెనాలి రైల్వేస్టేషనులో 8 రైలు కంపార్టుమెంట్లు పరశురామప్రీతి గావింపబడినట్లు ప్రత్యక్షసాక్షి కథనం. ఆ వీరోచిత పోరాటంలో అసువు లర్పించిన త్యాగశీలురకు చిహ్నంగా సప్త స్తూపాలను రణరంగచౌక్‌లో నేడు చూడవచ్చును. కొన్ని వేల రూపాయలు విలువచేసే మిల్లువస్త్రాలు బూడిద

పాల్గొనాయి. ఈ సంఘటనలో తెనాలి ప్రాముఖ్యం చర్చిల్‌వరకు ప్రాకింది. ప్రాథమిక పాఠశాలవిద్యార్థుల మొదలు అందరూ మహోద్రేకంతో ఊగిపోయినారు. పన్నుల సహాయనిరాకరణలో ప్రజలు ఉత్సాహంతో పాల్గొన్నారు. అందువల్లనే నష్టపరిహారంగా విపరీతపు పన్నులు విధించబడ్డాయి.

> గ్రంథాలయం మీకు ఉపయోగపడుతున్నది.
> మీరు గ్రంథాలయానికి తోడ్పడుతున్నారా?

దాదాపు అన్ని రాజకీయ పార్టీలను తెనాలి పౌరు లాదరించారు. పార్టీల సభ్యుల సంఖ్యకూడా ఈ తాలూకాలో అత్యధికమే. ఒకప్పుడు తెనాలి పరిసరాలు కమ్యూనిస్టు దౌర్జన్యవాదులకు ఆటపట్టుగా నెలకొన్నవి. కాని ఆ పార్టీని జాతీయ ప్రభుత్వం బహిష్కరించినపుడు అణిగిపోయినారు. ఎన్నికలలోకూడా తెనాలి పరిసరాలలో అత్యధిక సంఖ్యలో వోట్లు పోలయినాయి. ఇవన్నీ తెనాలి ప్రజల మహత్తర రాజకీయ చైతన్యానికి స్థూల నిదర్శనాలు మాత్రమే.

కళారంగంలో తెనాలి పౌరు లెప్పుడూ ముందడగువేసి ఇతరులకు మార్గదర్శకత్వం వహించేవారే. నాటకకళ ఇక్కడివారికి ఉగ్గుపాలతో పెట్టినది. "శివాజీ" "రోషనార" మొదలయిన చారిత్రాత్మక నాటకాలను ప్రదర్శించి ప్రజల నుద్రేక పరవశులను చేసిన మాధవపెద్దివారు తెనాలివారు కావడం విశేషం. వారు శివాజీ వేషం ధరించి నాటకమాడటానికి వీలులేదని నాటి బ్రిటిష్‌ప్రభుత్వం ఆజ్ఞాపించిన దంటే మాధవపెద్దివారు కలిగించే రసానుభూతి ఎంతటిదో ఊహించుకొనవచ్చు. ఇంకా స్త్రీ పాత్రలు ధరించడంలో స్త్రీలనే మించి రాష్ట్రపతినుండి 'పద్మశ్రీ'బిరుదాన్ని పొందిన స్థానం నరసింహారావుగారు తెనాలివారే. ఇంకనూ పులిపాటిసోదరులు, అద్దంకి మొదలయినవారు తమ సర్వస్వాన్ని నాటక కళారాధనకు ధారపోసి అదే పరమావధిగా జీవిస్తున్నారు. ఇక్కడ సాధారణంగా వీధివీధికీ ఒక నాటక సంఘం ఉంటుంది. బొగ్గులు కచ్చికలతో ముఖానికి రంగు పులుముకొని "లవకుశ"ల నాటకమాడే చిన్నారి పాపల దగ్గరనుంచి, ఏవిధమయిన ఉపకరణాల సాయం లేకుండా కన్నులలోనే హావభావా లుప్పతిలజేసే పరిణతపొందిన నటుల వరకూ ఉన్నారు. వృత్తినాటక సంఘా[illegible]హక నాటకసమాజాలుకూడా తెనాలిలో

పనిచేస్తున్నాయి. కనీసం నెల కొక పర్యాయమయినా నాటక ప్రదర్శనమో నాట్య ప్రదర్శనమో జరుగుతునే ఉంటుంది. ఇటువంటి పట్టణంలో సరైన రంగ స్థలం లేకపోవడం శోచనీయమని గుర్తించి ఒకప్పుడు మునిసిపల్ కమీషనరుగా నుండిన నాగభూషణంనాయుడుగారి ప్రోత్సాహం వలన, పురపాలక సంఘా ధ్వర్యంలో "నాగకళామందిరము" అనే "ఆరు బయలు రంగస్థలం" వెలసింది. ఇది అన్ని విధములైన ప్రజాకార్యక్రమాలకు, నాటకాది ప్రదర్శనలకు లభ్య మవుతూ తెనాలి సంస్కృతిని అంతో ఇంతో నిలబెట్టుతున్నది. తాలూకా హయ్యర్ సెకండరీ స్కూలులో కూడా పాలకవర్గం ప్రోత్సాహంతో శారదా కళాపీఠం నెల కొన్నది. ఇదికూడా నాటక కళను కొంతవరకు అభిమానించి పోషిస్తున్నది. సంగీతం కూడా తెనాలివా రభిమానించిన విద్యే. ఇచటి సీతారామ గాన విలాస సభవారు ప్రతి సంవత్సరం ఉత్సవాలు జరిపి ముసిరి, సెమ్మంగుడి మున్నగు ప్రఖ్యాత దక్షిణదేశ విద్వాంసుల నాహ్వానించి మరణించిన త్యాగరాజును పునః స్మృతికి కొనివస్తుంటారు. చిత్రలేఖనం కూడా తెనాలిలో ఆదరం సంపాదించు కొన్నది. వ్యాపారచిత్రకళను కొనసాగించే చావలి నాగేశ్వరరావు, గోలి శేషయ్య, సినిమాలలో కళా దర్శకత్వం వహిస్తున్న ప్రఖ్యాత చిత్రకారుడు మాధవపెద్ది గోఖలే తెనాలివారే, ఇక్కడ శారీరక వ్యాయామాన్ని యోగసాధనలను ఉచితంగా బోధించే వ్యాయామశాల ఉన్నది. ఈరీతిగా కళ అనబడే ప్రతిదాని చిహ్నాలను తెనాలిలో మనం చూడవచ్చు. పై పెచ్చు సాహితీ సమావేశాలు జరుగుతుంటాయి. అనేక కళాపరిషత్తులు, సంఘాలు వెలుస్తున్నాయి. వాటిలో చాలవరకు విజయవం తంగానే నడుస్తున్నాయి. కొన్ని నశిస్తున్నాయి. ఈనాడు చలనచిత్రాలలో వివిధ రంగాలలో ప్రముఖులైనవారు చాలావరకు తెనాలి పరిసరాలలోనివారే కావటం గర్వకారణం.

"వాణి నారాణి" యని చాటి చెప్పిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రన్న గూడ తెనాలివాసి యని నేటి పిల్లలమఱ్ఱివంశమువారి పూర్వీకుడని అంటారు కాని రూఢి అయిన ఆధారములు కానరావు. ఏమయినను తెనాలి అఖండ ప్రజ్ఞావంతులు, దురవగాహమైన మానవ హృదయపు లోతులలోని రసాపగావిష్కార మొనర్ప సమర్థులు అయిన రచయితలను సృష్టించినదనటం నిర్వివాదాంశం. గద్యరచన ఆధునికకాలంలో అత్యంత ప్రాచుర్యంపొందిన రచనా ప్రక్రియ. కథ, నవల, వ్యాసము విమర్శ మున్నైనవి ఇందులోని భాగాలు. ఈ ఒక్కొక్క సాహిత్య



రక్షణ పరికరాల ఉత్పత్తి శాఖామాత్యులు
శ్రీ కొత్త రఘురామయ్యగారు
తెనాలి ప్రాంతీయులు.

ప్రక్రియనే స్వీకరించి రచనా వ్యవసాయం కొనసాగించి యావదాంధ్ర దేశ ప్రశస్తికెక్కినవారనేకులకు తెనాలి మాతృస్థానము. కవిరాజ బిరుదాంకితులై ప్రాచీన పురాణాలను హేతువాదంలోను, శాస్త్రీయ దృక్పథంలోను సమన్వయపరచిన త్రిపురనేని రామస్వామిగారు కృష్ణా జిల్లాలో జన్మించినప్పటికీ తెనాలినే తమ నివాసంగా ఎన్నుకొన్నారు. అలాగే కవికోకిల జాషువాగారు పీడిత ప్రజానీకపు ఆక్రందనలను కరుణాత్మకంగా చిత్రించిన వారు తెనాలిలోనే నివాసమేర్పరచుకొన్నారు. తెలుగు సంస్కృత భాషా పాండిత్యాలలో సవ్యసాచివంటి మాధవరాయశర్మగారు తెనాలివారే. ఈ రీతిగా చెప్పుకుంటూపోతే కొన్ని వందలమంది నుదాహరించవచ్చును. ప్రాచ్య ప్రాశ్చాత్య తాత్త్విక ఆలంకారికాది సిద్ధాంతాలలోను సాహిత్యంలోను నిష్ణాతులైన డా॥ జి. వి. కృష్ణారావుగారు, ఆంధ్రదేశం గర్వించదగిన కథానికా నవలారచయితలయిన గోపీచంద్, కొడవటిగంటి, ధనికొండ, చలం, చక్రపాణి మున్నగువారు తెనాలినుంచివెళ్ళినవారే అని అనుకొనడం తెనాలి పౌరులకు గర్వకారణం. కాల్పనిక కవితోద్యమానికి రొమాంటిక్ మువ్‌మెంట్ బాసటగా నిలిచిన సాహితీసమితి వార్షికసమావేశాలు పెక్కుమార్లు తెనాలిలో జరిగాయి.

ఈ రీతి సుమారు ఒకటిన్నర దశాబ్దాలకు పూర్వం తెనాలి సకల రంగాలకు ఉద్యమాలకు ఆటపట్టుగా ఉండేది. ఒకమూల సాహితీ చర్చలు సందడిస్తుంటే, ఒకవైపు కళాదేవి విచ్చలవిడిగా సంచరిస్తుంటే, మరొకప్రక్క రాజకీయోద్యమం రగులుకొని వ్యాపిస్తుంటే ప్రతి ఇల్లూ ఏదో ఒకదానికి నిలయమై అలరారుతుండేది. ఎటుచూచిన ఉత్సాహమే. కోలాహలమే. అపుడు తెనాలి ఖ్యాతి భారతదేశమంతటా పెరిగిపోయింది.

## నైసర్గిక పరిస్థితులు

సమీపాన, అంటే కనుచూపుమేర దూరంలో ఒక నదిగాని, అడవిగాని, సముద్రంగాని, పర్వతపంక్తులుగాని లేని ప్రదేశాలలో తెనాలి ఒకటి. అందుచేత ఇక్కడి వాతావరణం చాలావరకు సమశీతోష్ణంగానే ఉంటుంది. ఎండలు, వర్షాలు, చలి సమపాళంగా మేళవింపబడి అన్ని పనులకు సానుకూలంగా ఉంటాయి. నేలలో "జల" సమృద్ధిగా ఉన్నది. ఇదంతా సారవంతమైన కృష్ణా డెల్టాభూమి. ఎక్కువభాగం నల్లనేల. పరిసరాలన్నీ కాలువలతో అల్లిబిల్లిగా అల్లుకొని ఉండేది.

పూర్వం తెనాలిగ్రామంలోకి రావాలంటే వరుసగా ఉన్న మూడుకాలువలు దాటవలసి వచ్చేది. కొద్దికాలానికే ఒక వంతెన నిర్మింపబడింది. రాకపోకలు నిరాటంకంగా సాగేవి. ఊరుకూడా విరివిగా పెరిగిపోయింది. ఇప్పుడు సుమారు రెండుంబాతిక మైళ్ళపొడవు, అంతే వెడల్పుగల విశాల పట్టణంగా రూపొందింది. జనాభా ఒక "ల"కారానికి సమీపంలో ఉన్నది (1961 Census). ఒకప్పుడు తెనాలి మొత్తం రేపల్లె తాలూకా క్రిందికి చేరి ఉన్నది. కాని తరువాత విడదీయబడింది. దాదాపు అర్ధశతాబ్ది క్రితమే ఊరు మునిసిపల్ ఏరియాగా ప్రకటింపబడింది. గుంటూరు జిల్లాలోని నాలుగు సబ్‌డివిజన్లలో తెనాలి ఒకటి. కృష్ణాజిల్లాకు బందరు కార్యనిర్వాహకస్థానమైనప్పటికీ విజయవాడ కెంత ప్రాముఖ్యముందో అదేరీతిగా గుంటూరు మండలంలో తెనాలి ముఖ్యమైనది. డిప్యూటీ కలెక్టరు, సబ్‌జడ్జి, డిస్ట్రిక్ మున్సిఫ్ కోర్టు, డిప్యూటీసూపరింటెండెంటు మున్నగువారి కార్యస్థానాలు తెనాలిలో ఉన్నాయి. ఈ విధంగా ఈ తాలూకా కేంద్రం గుంటూరునగరం తరువాత సర్వవిధముల ఉత్కృష్ట స్థానానికి అర్హమయినది.

పైన చెప్పినట్లు, పట్టణ తాలూకా పరిసరములన్నీ పంటకాలువలతో నిండి యుండటంచేత మాగాని వరి ఇక్కడ ముఖ్యపంట. గుంటూరుజిల్లా ఆంధ్రప్రదేశ్‌కు ధాన్యాగారమయితే, తెనాలి గుంటూరు జిల్లాకు ధాన్యాగారం (Granary of Guntur Dt). ఇక్కడ కేంద్రప్రభుత్వం సహాయంలో నిర్మింపబడిన కోపరేటివ్ మార్కెటింగ్ సొసైటీవారి ధాన్య గిడ్డంగు లున్నాయి. రైతులు లాభం పొందే టందుకు ధాన్యం దాచుకొనుటకు ఇవి ఉద్దేశింపబడ్డాయి. అక్కడక్కడ బెల్లపు

> గ్రంథాలయం మీదే సుమా!
> దానిని ఉపయోగించుకోండి.
> దాని అభివృద్ధికి తోడ్పడండి.
>
> ★
>
> విద్యావిహీనః
> పశుభిస్సమానః

చెఱకు కూడా పండించి బెల్లం వండుతుంటారు. మెట్టప్రాంతం చాల తక్కువ. దానిలో కూరగాయలు, జొన్న చొప్ప, జనుమువంటి పశువులమేతకు పనికివచ్చే పంటలు పండిస్తుంటారు. ఒక వ్యవసాయ శాఖాధికారి కార్యాలయం కూడా ఇక్కడ ఉన్నది. మేలిరకం విత్తనాల పరిశోధనాకేంద్రం ఒకటి ఇక్కడ స్థాపించాలనే యోచన కేంద్రప్రభుత్వాని కున్నది. ఈ తాలూకాలోని దుగ్గిరాల, పెదపాలెం వంటి చోట్ల వ్యాపారపు పంట అయిన పసుపు విరివిగా పండుతుంది, దుగ్గిరాలలో పసుపు ఫ్యాక్టరీ, పెదపాలెంలో పరిశోధనాకేంద్రం ఉన్నాయి.

వరి ముఖ్యపంట కావటంవలన బియ్యపుమిల్లులు సుమారు 20 వరకు తెనాలిలో ఉన్నాయి. ఇదే ఇచ్చటి ముఖ్యవ్యాపారం. ఈ బియ్యం దేశంలోని చాలా ప్రదేశాలకు ఎగుమతి అవుతాయి. నిమ్మకాయలు అనుదినం కలకత్తా పంపబడు తుంటాయి. నాలుగైదు సూపె కర్మాగారాలుగూడా ఉన్నాయి. అన్వేష్, శోధన్ వంటి కుటీరపరిశ్రమలు రంగులు తయారుచేసేవి, ప్రభుత్వసాయంతో నడుస్తున్నాయి. ఇంకా నీల్‌కాల్, రూబి, శేఖర్‌వంటి సిరాపరిశ్రమలు సరేసరి. ప్రసాద్ పెన్‌వర్క్స్, అశోకా, సోలార్ మొదలయినవారు కలాల నిర్మాణంలో అత్యంత అనుభవంలో నూతన ప్రమాణాలను సాధిస్తున్నారు. పెన్సిళ్లు, పిన్నీసులు, బ్లేడ్లు తయారుచేసే ఒక పారిశ్రామిక వాటికా (ఇండస్ట్రియల్ ఎస్టేట్) నిర్మాణానికి ప్రభుత్వానుమతి లభించినట్లు తెలుస్తున్నది. ప్రభుత్వం ఒకప్పుడు పెంకులు, పింగాణీసామానులు తయారుచేసే పరిశ్రమ ఆరంభించింది గాని అది ఫలప్రదం కాలేదు. సామానుల ఎగుమతి దిగుమతులకై అనేక లారీసర్వీసులు తెనాలినుంచి నడుపబడుతున్నాయి.

ఆంధ్రదేశంలో అత్యధిక విద్యార్థులు, విద్యాసంస్థలుగల జిల్లా గుంటూరు. కాబట్టి తెనాలిగూడా విద్యలకు నిలయమే. ప్రథమశ్రేణిలోనికి చేర్చబడి, ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు అనుబంధితము చేయబడిన ఒక కళాశాల ఇచట ఉన్నది. అంతేగాక తెనాలి పట్టణమున సంస్కృత కళాశాల, వేదపాఠశాల, ఉన్నత విద్యాలయాలు, ప్రాథమిక విద్యాలయాలు తగినన్ని ఉన్నవి.

ఇక్కడ అన్నిమతాలవారు పరస్పర సహనభావంతో జీవిస్తున్నారు. మతమనేది మానవుని దైనందిన జీవితంలో ఒకప్పుడు ప్రముఖస్థానం వహించింది. దాని విశిష్టత ఈనాడు తగ్గిపోయినప్పటికీ ప్రజల వ్యవహారాలలో దాని ప్రభావాన్ని పూర్తిగా త్రోసిరా జనలేము. ఇతఃపూర్వమే చెప్పినట్లు తెనాలిలో అత్యంత ప్రాచీనమైన రామలింగేశ్వరస్వామి ఆలయము, గోవర్ధనస్వామి ఆలయము ఇప్పటికీ ధూప దీప నైవేద్యాలతో వర్ధిల్లుతూనే ఉన్నాయి. ముస్లిములకు నాలుగు మసీదులున్నాయి. క్రైస్తవులలో రోమన్‌కాథలిక్‌లకు, ప్రొటెస్టెంట్లకు చెందిన రెండు చర్చీ లున్నాయి. పట్టణంలో మార్వాడీలసంఖ్య హెచ్చుకావడంతో వారంతా కలసి రెండు లక్షల రూపాయలు వెచ్చించి పట్టణపు నడిబొడ్డులో అత్యంత సుందరమగు ఆలయాన్ని నిర్మించుకొన్నారు. ఇక హిందువులకు చిన్నచిన్న ఆలయాలు ప్రతి పేటలోను వెలిశాయి. ఆయా మతానుయాయు లందరూ ప్రశాంతంగా తమ దైవాలను ఆరాధించుకొంటుంటారు. దసరా (దేవీ నవరాత్రులు), శ్రీరామనవమి వంటి పండుగలు అత్యంత కోలాహలంగా వైభవంగా జరుగుతుంటాయి. పురాణ కాలక్షేపాలు, ధార్మికోపన్యాసాలు ప్రజల నాకర్షిస్తుంటాయి.

వైద్యసదుపాయంలోగూడ తెనాలి మిగిలిన పట్టణాల కేమీ తీసిపోయినది కాదు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో విదేశాలకేగి ఉన్నత విద్య నభ్యసించి యుద్ధములో క్షతగాత్రులకు చికిత్సచేసి మేజర్, కెప్టెన్ పదవు లలంకరించినారు కొందరు తెనాలి వైద్యులు. శస్త్రచికిత్సలో యావదాంధ్ర దేశాన ప్రముఖుడుగా పేరొందిన కృష్ణయ్యచౌదరిగారు తెనాలి వాస్తవ్యులే. సర్వోదయ సిద్ధాంతానుయాయి అయిన వెంపటి సూర్యనారాయణగారు పేదవారికి సహితము ఉపకరించునట్లు నేత్ర వైద్యాలయము నడపుచున్నారు. ఇంకా అనేక వైద్య విద్యా పట్టభద్రు లిక్కడ నెలకొన్నారు. నాటక కళలో మంచి ఖ్యాతి నార్జించిన డా॥ గోవిందరాజుల సుబ్బారావుగారు ఇక్కడ చాలాకాలం వైద్యుడుగా పనిచేశారు. అధునాతన సదుపాయాలతో గూడిన ఒక ప్రభుత్వ వైద్యాలయంగూడా నిర్వహింపబడుతున్నది. దీనిలో కొన్ని స్పెషలు వార్డులు సుమారు 100 పడకలు ఉన్నాయి. ఈ వైద్యాలయానికి అనుబంధంగా ఒక ప్రథమ చికిత్సాకేంద్రం, కుటుంబనియంత్రణ కేంద్రం పనిచేస్తున్నాయి. ప్రతిపేటలోను మునిసిపాలిటీవారి ఆయుర్వేద వైద్యాలయా లున్నాయి. రెండు మూడు మాతాశిశు సంరక్షణశాలలున్నాయి. హోమియో వైద్యం ఇప్పుడే ప్రజాభి

మానాన్ని చూరగొని చౌకగా వ్యాధులు నివారిస్తున్నది. ఇవిగాక ప్రభుత్వంవారి మలేరియా నిర్మూలన కార్యక్రమంక్రింద ఒక దళం పనిచేస్తున్నది.

> విశ్వవిద్యాలయాల విద్య కంటె ఉత్తమమైనదే లేదు. విద్యావిహీనమైన విశ్వవిద్యాలయాలకంటె అనర్థకమైనవి మరి లేవు.

ఆధునిక నాగరక సమాజంలో జీవిస్తున్న ప్రతివ్యక్తికీ విశ్రాంతి నొసగి మానసికోల్లాసం కలిగించే సాధనాలు అత్యవసరం. పట్టణంలో లజపతిరాయిపేర కట్టబడిన క్లబ్బు, ప్రభుత్వ గుమాస్తా ఉద్యోగుల క్లబ్బు, ఆఫీసర్ల క్లబ్బు, చిరకాలంనుంచి చాలామంది జనులకు కాలక్షేపం కలిగిస్తున్నాయి. వినోద సాధనమైన సినిమాప్రదర్శనకు ఆరు మందిరా లున్నాయి. పైనచెప్పిన గ్రంథాలయా లున్నాయి; ఏడెనిమిది పురోద్యానవనాలు పౌరుల సాయంవిహారార్థం పురపాలకసంఘంక్రింద నిర్వహింపబడుతున్నాయి. ఇవిగాక అప్పుడప్పుడు నాటక నృత్య ప్రదర్శనలు జరుగుతూనే ఉంటాయి. వ్యాయామశాలలు గూడ ప్రజలకు ఆరోగ్యకరమయిన కాలక్షేపాన్ని కలిగిస్తున్నాయి.

## అభ్యుదయ పథంలో

ఈ విధంగా తెనాలి నగరం చరిత్రకు తెలిసిననాటినుంచీ నేటివరకు నిరంతరాయంగా అభ్యుదయ పథంలో సాగిపోతున్నది. పట్టణంలో నూతన భవనాలు వెలుస్తున్నాయి. వీధులు సిమెంటు మలామా చేసుకొంటున్నాయి. విద్యుద్దీపాలు మూలమూలల చీకట్లను పారద్రోలుతున్నాయి. విద్యాలయాలు విద్యార్థుల సంఖ్య పెరుగుతున్నది, మొత్తముమీద నిండుగా రూపొందుతున్నది.

ఇప్పటినుంచి మద్రాసు - ఢిల్లీ (కలకత్తా) రైల్వేలైను పోవుచుండుట ఇంత ప్రాముఖ్యం కలుగడానికి చాలావరకు కారణమైందని చెప్పవచ్చు. గుంటూరు-రేపల్లె రైలుమార్గము తెనాలిగుండానే పోతున్నది. "అనేకరైళ్ళకు" ఇది కూడలి స్థానము. ప్రజల అవసరాలకు అనుగుణంగా రైల్వేస్టేషను విశాల మొనర్పబడి నూతనంగా నిర్మితమవుతున్నది. ఇంతేగాక సమీపస్థములైన గ్రామాలన్నింటికీ

రోడ్డుమార్గాలు, బస్సు సౌకర్యాలు ఉన్నాయి. అనుదినం పరిసరాలలోని గ్రామాల నుంచి తెనాలినగరానికి సుమారు రెండు లక్షల రూపాయలు కొనుగోలు పేరిట చేరుతుంటాయి.

తెనాలినుంచి సరకుల రవాణా కుపయోగించే నారాకోడూరురోడ్డు రెండు రైలుగేట్లను దాటవలసి వస్తుంది. ఈ రైల్వేలైన్లమీద సగటున రోజుకి 40 రైళ్లు ప్రయాణిస్తుంటాయి. మాటిమాటికీ గేటు మూయడం తీయడం వలన రాకపోకలకు ఆటంకం కలిగి అనేక నష్టాలు కలిగిస్తున్నది. వర్తకులు పారిశ్రామికులు తదితరుల కృషి ఫలితంగా లక్ష రూపాయలలో ఒక రైల్వే ఓవర్‌బ్రిడ్జి నిర్మించడానికి ప్రభుత్వం పూనుకొన్నది. ఇది ముదావహం. పూర్వం చాలా ఇరుకుగా ఉండిన మూడుకాలువలమీద వంతెన, రాబోవు రైల్వేబ్రిడ్జిని దృష్టిలో ఉంచుకొని వెడల్పు చేయడం జరిగింది.

తెనాలి పరిసరాలలో భూమిపైన ఏ కొద్దిలోతు త్రవ్వినా నీటి ఊట సమృద్ధిగా పడుతుంది. అందుచేత బోరింగుపంపులు ప్రజలకు నీటి సదుపాయాన్ని కలుగజేస్తున్నాయి. పురపాలకసంఘంవారి అండర్‌గ్రౌండ్ పైప్‌లైన్ల నీటిసరఫరా లేని పట్టణం దాదాపు తెనాలి ఒక్కటే. ఇంతవరకు అట్టి అవసరం కలుగలేదు. భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని మంచినీటి బావులు త్రవ్వించడానికి తగిన స్థలాన్ని పురపాలకసంఘంవారు క్రయం చేశారు. తెనాలి కొంచెం పల్లపుమట్టంలో ఉండటంచేత మురుగునీటి ఎద్దడి ఎక్కువ. అందువలన అనారోగ్య వాతావరణం గూడా తేలికగా నెలకొంటుంది. ఇటీవలనే సుమారు 33 లక్షల రూ॥ ఖర్చుతో తెనాలి మురుగు పారుదల పథకాన్ని ప్రభుత్వం ఆమోదించింది. ప్రస్తుతం పని సాగుతున్నది. 1965 నాటికి సంపూర్ణం కావచ్చు. ఈ మంచినీటి, మురుగుపారుదల పథకాలు అమలులోనికి వస్తే ప్రజలకు దాదాపు అన్నిసౌకర్యాలు లభ్యమైనట్లే.

ప్రస్తుతం నిర్మాణంలో ఉన్నటువంటి, ఆలోచనలో ఉన్నటువంటి పథకాలన్నీ కార్యరూపం ధరించినట్లయితే, తెనాలి ఆంధ్రదేశంలో అత్యంత అధునాతన నగరంగా రూపొందుతుంది అనటం నిస్సందేహం. అందుకు ఎవరి కర్తవ్యం వారు నిర్వహించడం అవసరం.

తెనాలి చరిత్ర తలచుకొన్న పుడు గుర్తుకువచ్చే ప్రధానసంస్థలు మరి రెండు ఉన్నవి. గుంటూరు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు ప్రధాన కార్యాలయం తెనాలిలోనే ఉన్నది. దీనికి శాశ్వత భవన మున్నది.

అంతేగాక గుంటూరు జిల్లా కాంగ్రెస్ ప్రధాన కార్యాలయం తెనాలిలో స్వర్గీయ పాతూరి సుబ్బయ్యగారి జ్ఞాపకార్ధము నిర్మించిన భవనములో కలదు. ఈ విధంగా తెనాలి అనేక సంస్థలతో, మన రాష్ట్రంలో ప్రముఖ సంస్కృతీ కేంద్రంగా నిత్య నూతనంగా వెలరారు తున్నది.



తెనాలితాలూకా రాజకీయ చరిత్రలో గణనీయమైన పాత్రవహించిన, గ్రంధాలయోద్యమాభిమానులు.
శాసనసభ్యులు
శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు

గాలి నీరును లేకున్న బ్రతుకవచ్చు
గ్రాసమును లేక ఎట్టెట్టో గడపవచ్చు
గడప వచ్చునె మన మొక్క గడియమైన
గ్రంథ భండారములు లేని గ్రామమందు.

— మధురకవి.

# మా నివాళి



గ్రంథాలయ శాస్త్ర తపస్వి, గ్రంథాలయ శాస్త్ర పంచసూత్ర సంధాత డాక్టర్ శ్రీ యాలి రామామృత రంగనాథన్ గారికి యావత్ప్రపంచములోని గ్రంథాలయాభిమానులు, కార్యకర్తలు 71 వ జన్మదినోత్సవం జరుపుతున్నారు. ఈ సందర్భములో తాలూకా గ్రంథాలయ సంఘం తరఫున మా అభినందనలు తెలుపుకుంటున్నాము.

# గుంటూరు జిల్లాలో గ్రంథాలయ వికాసం

శ్రీ కె. ఉమామహేశ్వరరావు
ఛైర్మన్, లోకల్ లైబ్రరీ అథారిటీ.

విజ్ఞాన వికాసానికి తోడ్పడే సంస్థలలో గ్రంథాలయాలు ప్రధానమైనవి. నవనవోన్మేషమైన భావనాసంపత్తితో ప్రజలలో నవ చైతన్యాన్ని పెంపొందించు ప్రజాసంస్థలలో గ్రంథాలయాలు ప్రధానమైనవి. నిజం చెప్పాలంటె గ్రంథాలయం ఒక విజ్ఞానఖని. భావనాఝరి.

చారిత్రకంగా చూచినట్లయితే ప్రాచీనకాలమునుండి గుంటూరు జిల్లాలో గ్రంథాలయ వికాసం కనిపించుతూనే వుంది. బౌద్ధుల కాలంలో ఆంధ్ర దేశంలో వెలసిన విశ్వవిద్యాలయాలు భారతావనిలోని విద్యాసంస్థలలోకెల్ల తలమానికమైనవి. ముఖ్యంగా అమరావతీ, నాగార్జున విశ్వవిద్యాలయాలకు భారతదేశం నలుదిశల నుండియే గాక చీనా, బర్మా, సింహళము మొదలయిన దేశములనుండి వివిధ శాస్త్రాల అధ్యయన నిమిత్తం విద్యార్థులు వచ్చెడివారు.

శాలివాహనుల కాలములో అమరావతీ పట్టణములో విశ్వవిద్యాలయం ప్రఖ్యాతి గాంచినది. ఈ విశ్వవిద్యాలయములో బ్రాహ్మణ బౌద్ధాది ధర్మశాస్త్రములు బోధింపబడెడివి. నాటి వాఙ్మయమున గల అనేక ప్రామాణిక గ్రంథాలు యీ విశ్వవిద్యాలయములలో పొందుపరుచబడినవి. శ్రీపర్వతమువద్ద గల నాగార్జునాచార్యునికడ గూడ అపూర్వ గ్రంథసంచయం గలదు. మహావిహార మను నాగార్జునాచార్యుని భవనములో 84,000 సంభాషణలు గల త్రిపిటకములు, భూగోళ, లోహవిజ్ఞానములందు అనేక గ్రంథాలు ఉన్నవి. అంతేగాక రసవాద, రసాయన, ఆరోగ్య, రత్న, వృక్షశాస్త్రములకు సంబంధించిన అనేక గ్రంథాలుగూడ కలవట. ఈ శాస్త్రములయం దన్నిట నాగార్జునాచార్యులు నిష్ణాత కావటంచేత తత్త్వ జిజ్ఞాసచేత దిగ్దగంతాలను

ఉర్రూతలూగించాడు. ఆ మహత్తరశక్తిసంపదకు నాడున్న అపూర్వ గ్రంథసంచయం ఎంతటి దివ్యానుభూతి కలిగించినదో మన మూహింపలేము గదా !

ప్రాచీనకాలమునుండీ మతశక్తులు ఆంధ్రాభ్యుదయమునకు వెన్నుపోటు పొడుచుచునే యున్నవి. ఆ కరాళ దంష్ట్రల బారినుండి మన విశ్వవిద్యాలయాలు తప్పించుకొనిపోలేక పోయినవి. కొలదికాలంలోనే మన ప్రజాసంస్థలన్నియు మట్టిపాలయినవి. ఆ తర్వాత అచటచట కొన్ని పౌర గ్రంథాలయాలు సంపన్నులపరంగా తలయెత్తినవి. కాని వాటిలో చెప్పుకోదగ్గ అభివృద్ధి కనుపించలేదు. పైగా అవి సామాన్య ప్రజానీకానికి ఉపయోగించలేదు.

నిజంచెప్పాలంటే పందొమ్మిదోశతాబ్దంలోనే పౌర గ్రంథాలయాలకు నాంది పలికింది. కాగితం తయారీ, పుస్తకముల ముద్రణ మొదలయినవాటివలన సామాన్యులు సహితం పుస్తకాలు చదువుకోడానికి అవకాశం ఏర్పడింది. చెదురుమదురుగా గ్రంథాలయాలు స్థాపించబడినవి. చారిత్రక ఆధారాలకు నిలచినంతవరకు 'మనజిల్లాలో ప్రప్రథమంగా పౌరగ్రంథాలయం స్థాపించిన ఘనత జిల్లాకేంద్రమయిన గుంటూరు పట్టణమునకే దక్కినది. 1900 సంవత్సర ప్రాంతములో గుంటూరునందు సాహితీ సంఘం అధ్వర్యాన ఒక గ్రంథాలయం స్థాపించబడింది. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు, శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామి సీతారామ్) మొదలయిన తెలుగు జోదుల సారథ్యంలో యీ గ్రంథాలయం ప్రశంసనీయంగా పనిచేసింది. తుదుపరి యీసంఘం గ్రంథాలయయాత్రలు, ఉత్సవములు, వయోజన విద్యాప్రచారముద్వారా జిల్లాలోని అనేకమంది యువకులను ఆకర్షించినది. అంతేగాక ప్రథమాంధ్ర మహాసభ ఏర్పాటు చేయుటకు కారణభూతమై ప్రత్యేకాంధ్రరాష్ట్ర ఉద్యమానికి, భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణానికి పునాదులు వేసినది. ఈ విధముగా నాడు గ్రంథాలయాలు అనేక ఉద్యమాలకు నిలయమై ఆంధ్రాభ్యుదయానికి అశేషమైన కృషి చేసినవి.

వాడవాడలా గ్రంథాలయాల అవసరాలను ప్రచారం చేసిన ఫలితంగా 1914 లో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము స్థాపించునాటికి గుంటూరు మండలము 35 గ్రంథాలయాలవరకు పనిచేయ నారంభించినది. 1916 సంవత్సరమున తెనాలి పట్టణమున గుంటూరు మండల ప్రథమ గ్రంథాలయసభ జరిపిన అనంతరం గుంటూరు మండల గ్రంథాలయ సంఘమును స్థాపించిరి. 1920 సంవత్సరము నుండి ప్రభుత్వమునుండి సహాయము పొందుటకు పౌరగ్రంథాలయములకు వీలుకలిగెను.



యావదాంధ్రదేశానికి తలమానికమైన సారస్వతనికేతనాన్ని ఎంతో ఆదర్శవంతంగా నిర్వహించుతున్న ప్రజ్ఞాశాలి శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు

అప్పట్లో ప్రారంభించిన సహాయనిరాకరణ ఉద్యమంలో గ్రంథాలయ కార్యకర్తలు విశేషముగా పాల్గొని కారాగారవాసము అనుభవించుటమూలముగా నీయుద్యమమునకు కొంత విఘాత మేర్పడినది. అయినప్పటికి గ్రంథాలయాల అవసరాన్నిమాత్రం ప్రజలు మరువలేదు. 1942 నాటికే గుంటూరు జిల్లాలో గ్రంథాలయాల సంఖ్య 209 కి పెరిగింది.

ఆపారతంత్ర్యపు దినాలలో గుంటూరు మండలములో అనేక గ్రంథాలయాలు ప్రశంసాత్మకమయిన కృషిచేసినవి. వాటిలో వేటపాలెమున స్థాపించబడిన సారస్వత నికేతనము గణనీయమైనది. 1918న వెలువడిన పత్రికా సంపుటాలే గాక, అనేక ప్రామాణిక గ్రంథాలతో నేటికీ దిన దిన ప్రవర్ధమానమౌతూ ఉంది,

## సంచార గ్రంథాలయాలు

ఇదే విధముగా పెదపాలెం తెనాలితాలూకా సేవాశ్రమము తరఫున బోటు గ్రంథాలయము, రేపల్లెతాలూకాలో ఖైదీలకోసం ఏర్పడిన జైలు గ్రంథాలయం, గుంటూరుపట్టణ గ్రంథాలయ సంఘము వారు రోగులకోసం ఏర్పాటుచేయబడిన హాస్పిటల్ గ్రంథాలయం విశేషంగా కృషిచేసి ఆంధ్రదేశానికే ఆదర్శవంతంగా నిర్వహింపబడ్డాయి. ఇదేకాలంలో అమృతలూరు పౌరులు ఏర్పాటుచేసిన భాషాభివర్ధని గ్రంథాలయం; పాంచాలవరం పౌరులు ఏర్పాటు చేసుకున్న శ్రీకృష్ణయోగి గ్రంథాలయం; మోపర్రు ప్రజలు ఏర్పాటుచేసుకున్న చౌదరి గ్రంథాలయం; మండూరుగ్రామములో కీ॥ శే॥ తోకల నాగయ్య గారి కృషివల్ల ఏర్పాటుకాబడిన శ్రీ ఆంధ్ర సరస్వతీ నిలయము; గోవాడగ్రామంలో ఏర్పాటు చేయబడ్డ శ్రీ రాజరాజ నరేంద్ర గ్రంథాలయం; కూచిపూడి, మూల్పూరు, పెదపూడి, సంగంజాగర్లమూడి, శృంగారపురం, ఈమని, మరియు తెనాలి పట్టణములో మున్సిపల్ లైబ్రరీ చాల ప్రశంసనీయమైనవి. ప్రజలను వివేకవంతులను చేయుట అజ్ఞాన తిమిరంలో నిద్రాణమైయున్న స్వేచ్ఛా పిపాసను మేలుకొల్పుటకు ఈ గ్రంథాలయాలుచేసిన సేవను ఆంధ్రదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసిన అవసరం ఉంది.

## గ్రంథాలయ చట్టం

ఇంతవరకు గ్రంథాలయాలు కేవలం ప్రజా సహకారంతోనే నిర్వహింపబడుతున్నవి. ప్రభుత్వంమాత్రం నామమాత్రం సహాయం

> నా తండ్రికి నేను ఋణపడి వున్నాను. కారణం: ఆయన జీవనాన్ని నాకు ప్రసాదించడమే; నా గురువునకూడా ఋణపడివున్నాను. కారణం: ఆయన నాకు మేలుతరమైన జీవితం ప్రసాదించడమే.
>
> — *Napoleon*

చేస్తున్నది. గ్రంథాలయాలకు ఒక ప్రత్యేక చట్టమున్న యెడల గ్రంథాలయాలు విశేషంగా వృద్ధికాగలవనీ, ఆర్థికంగా యిబ్బందు లుండవనీ, ప్రజాసహకారము – ప్రభుత్వ సహాయము సమ్మిళితమైనపుడు చక్కని ఫలితా లుండగలవని పలువురు ప్రముఖులు భావించారు. తత్ఫలితంగా 1948 సంవత్సరంలో మద్రాసు పౌరగ్రంథాలయముల చట్టం ఏర్పడింది. 1950 నుండి అమలులోకి వచ్చింది.

ఈ చట్టం ప్రకారం గుంటూరుజిల్లాలో స్థానిక గ్రంథాలయ సంస్థ (లోకల్ లైబ్రరీ అథారిటీ) ఏర్పడింది. ఈ సంస్థకు ప్రముఖ గ్రంథాలయ సేవకులు శ్రీ శరణు రామస్వామిచౌదరిగారు మొదటి రెండుపర్యాయములు అధ్యక్షులుగా ఎన్నికై ప్రశంసనీయమైన సేవ చేసియున్నారు.

ఈ సంస్థ స్థాపించినపిదప గుంటూరు జిల్లాలోని గ్రంథాలయాల చరిత్రలో నూతన శకము ప్రారంభమైనది. ఆర్థికంగా అన్ని హంగులు గల యీ సంస్థ యిదివరలో భవనాలుగల అనేక గ్రంథాలయాలను స్వాధీనము చేసికొని 5000 జనాభాగల పట్టణాలలో, పల్లెలలో గ్రంథాలయాలు నిర్వహించటానికి ప్రయత్నిస్తోంది.

జిల్లాలో యీ క్రిందిచోట్ల స్థానిక గ్రంథాలయసంస్థ యాజమాన్యంలో గ్రంథాలయాలు పనిచేస్తున్నవి. గ్రేడ్ I గ్రంథాలయాలు– గుంటూరు, తెనాలి; గ్రేడ్ II గ్రంథాలయాలు – రేపల్లె, బాపట్ల, ఒంగోలు, చీరాల, నర్సరావుపేట, గురజాల, వినుకొండ, సత్తెనపల్లి;

గ్రేడ్ III గ్రంథాలయాలు – తాడికొండ, అమరావతి, అమృతలూరు, మంగళగిరి, చిలకలూరిపేట, పిడుగురాళ్ళ, ముప్పాళ్ళ, దుగ్గిరాల, కొలకలూరు, పెదరావూరు, ఇంటూరు, మంతెనవారి పాలెం, కర్లపాలెం, పర్చూరు, నిజాంపట్నం, కావూరు, భట్టిప్రోలు, అద్దంకి, మండడం.

గుంటూరులో గల భండాగారాన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయ మని, మిగతా వాటిని శాఖాగ్రంథాలయాలనీ అంటారు. ఈ గ్రంథాలయాలన్నిటిలో శిక్షణ పొందిన గ్రంథపాలకులే పనిచేస్తున్నారు.

ఈ గ్రంథాలయాలకు తోడుగా వెయ్యి జనాభాకు పైగల పల్లెలకు గ్రంథాలయ సౌకర్యాన్ని అందజేసే నిమిత్తం సంచారగ్రంథాలయాలు (బుక్ డిపాజిట్ సెంటర్సు) అచటచట స్థాపించబడి పనిచేస్తున్నవి. అనతికాలంలో యివి పల్లెపల్లెకు వ్యాపించగలవనటంలో సందేహం లేదు.

నేడు స్థానిక గ్రంథాలయా లన్నిటిలో రెండు లక్షల వరకు గ్రంథాలు, పత్రికల సంపుటాలు ఉన్నవి. రోజుకు ఏడువేలమంది చదువరులు గ్రంథాలయాలను ఉపయోగించుకొని ప్రయోజనం పొందుతున్నారు. రోజుకు వేయికిపైగా పుస్తకాలను యిండ్లకు తీసుకొనిపోయి చదువుచున్నారు. ప్రతి గ్రంథాలయమునకు ఏటేటా విలువైన గ్రంథాలు తెప్పించబడుచున్నవి. సత్సంప్రదాయాలు గల పత్రికలకు కొరత లేదు.

ఈ సంస్థ తరఫున గుంటూరులో ప్రత్యేకంగా బాలలకోసం గ్రంథాలయం నిర్వహింపబడుతోంది. అంతేగాక దాదాపు ప్రతి గ్రంథాలయంలోను బాలలకు, స్త్రీలకు ప్రత్యేక శాఖలు నిర్వహింపబడుతున్నాయి. దుగ్గిరాలలోని శాఖాగ్రంథాలయానికి అనుబంధంగా స్త్రీల శాఖ ప్రత్యేకంగా నిర్వహింపబడుతోంది. ఇలాగే మంతెనవారి పాలెం శాఖాగ్రంథాలయానికి అనుబంధంగా బాలలకు ప్రత్యేక శాఖ



మూడు దశాబ్దాలుగా గ్రంథాలయోద్యమానికి నిర్విరామకృషిచేస్తున్న నిరాడంబరజీవి శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు

నిర్వహించాలనే ఆలోచనగూడ ఉంది. మరొక ప్రత్యేక విశేష మేమనగా రేపల్లె శాఖాగ్రంథాలయమున ఉద్యోగుల ప్రోత్సాహమున సెలవురోజయిన శుక్రవారము సహితము పత్రికల విభాగము తెరచి యుంచబడుచున్నది. అలాగే అదే రోజున తెనాలి శాఖాగ్రంథాలయములో పత్రికల విభాగ మంతయు స్త్రీలకోసం నిర్వహింపబడుతోంది. ఇట్టి ఆదర్శవంతమైన సదవకాశాలు మరేజిల్లాలోనూ, మరే ప్రాంతంలోనూ లేవంటే మీకు ఆశ్చర్యం కలుగవచ్చు.

సాంకేతికంగాగూడ యీ గ్రంథాలయాలలో అభివృద్ధి కనిపిస్తోంది. పుస్తకములన్ని ప్రపంచ ప్రఖ్యాతమైన దశాంశవర్గీకరణ విధానంపై వర్గీకరింపబడినవి. పౌరగ్రంథాలయాలకు అనువైన నిఘంటు సూచి విధానం సూచీకరణకు వినియోగిస్తున్నారు. అత్యంత ఆధునిక విధానంలో జిల్లా కేంద్ర గ్రంథాలయం యితర గ్రంథాలయాలు నడిపేందుకు సర్వవిధాల ప్రయత్నం జరుగుతోంది.

ఆంధ్రప్రభుత్వం ప్రతిసంవత్సరం పౌరగ్రంథాలయాలకు గ్రాంటు యిస్తోంది. సహకారసంఘాల, పంచాయితీల, ప్రయివేటు సంస్థల యాజమాన్యంలోగల సంస్థలకు యీ గ్రాంటు లభిస్తోంది. దీనిని మంజూరు చేయటంలో ప్రభుత్వం స్థానిక గ్రంథాలయ సంస్థవారి సిఫారసులను ఆధారంగా తీసుకొంటోంది. కనుక యీ సంస్థ ఆ యా గ్రంథాలయాల ఉపయోగాన్ని గమనించి యితోధికంగా సాయపడటానికిప్రయత్నిస్తుంది.

గుంటూరుజిల్లాలో భవితవ్యంలో గ్రంథాలయా అభివృద్ధికి నిర్మాణాత్మకమయిన ప్రణాళికలు ఆలోచనలో నున్నవి. త్వరలో ఆరు శాఖాగ్రంథాలయాలు, మరికొన్ని సంచార గ్రంథాలయాలు స్థాపించబడతాయి. తెనాలిలో ప్రస్తుతము పనిచేయుచున్న శాఖా గ్రంథాలయములోకి పురపాలక సంఘ ఆధీనమునన్నున్న గ్రంథాలయమును కలిపి దానిని ప్రత్యేకముగా అభివృద్ధిచేసే ప్రయత్న మొకటున్నది. ఆ శుభదినాలు అట్టే దూరంలో లేవు.

గుంటూరుజిల్లాలో గ్రంథాలయసేవ చేయటానికి అవకాశమున్నంతవరకు స్థానిక గ్రంథాలయసంస్థ సర్వవిధాల చేయూతనిస్తుంది. అందుకు ప్రజల సహకారం, చేయూత నిచ్చి జిల్లాలో గ్రంథాలయ వికాసానికి తోడ్పడతారని ఆశిస్తాను.

—()—

యుగ యుగాంతరముల ప్రజాభ్యుదయ నీతి,
దేశసేవా తపస్సు నీతికలు పాడి
దనిస మహనీయుల ప్రబోధ సగళరాగ
మాలపించు వీణెలు పుస్తకాలయములు.

— దాసుబ్రోలు

## జ్ఞానము

శ్రీ అరవెల్లి సత్యనారాయణాచార్యులు

వాయు వెట్టులు సర్వ ప్రపంచమందు
వ్యాప్తమైయుండునో, యెల్లవారలకును
అటులె జ్ఞానంబు వ్యాప్తమై యుండెనేని
కొదువ మేముండు ? మానవకోటి కింక !

జీవనాధారభూతమై సృష్టిలోన
ఉదక మెట్టుల సేవ్యమైయుండు నటులె
జ్ఞాన మెపుడును సేవ్యమై మానవులకు
గూర్చు హాయిని శాంతిని గూర్మితోడ.

సూర్య చంద్రుల తేజముల్ సోక జగము
సర్వసౌఖ్యము లందదే ? సంతతంబు
జ్ఞానకిరణప్రసారము మానవులకు
నటులె సమకూర్చు సర్వసౌఖ్యములుగూడ.



A true university of these days is a
collection of books.

— *Carlyle.*

# మన విద్యాలయాలు

శ్రీ కె. ఆనందవర్ధన్, బి. ఏ.

గ్రంథాలయోద్యమానికి, విద్యాభివృద్ధికీ అవినాభావ సంబంధం వుంది. గ్రంథాలయోద్యమం విజయవంతం కావడానికి ప్రజలలో విద్యపట్ల ఆసక్తి పెంపొందాలి. అలాగే విద్యా కార్యక్రమాలు విజయవంతం కావడానికి గ్రంథాలయాలు అవసరం. ఈ సందర్భంలో తెనాలి పట్టణంలోగల వివిధ విద్యాసంస్థలను గురించి సంగ్రహంగా తెలపడమే ఈ వ్యాసోద్దేశం. వాటిని గురించి తెలుపబోయేముందు రాష్ట్రంలోని, జిల్లాలోని విద్యాభివృద్ధిని గురించి తెలుసుకోవడం అనవసరం కానేరదు.

అక్షరక్రమంలోకాని, అభివృద్ధి కార్యక్రమాలలో గాని మన ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. కాని విద్యావిషయకంగా చూస్తే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దేశంలోని ఇతర రాష్ట్రాలకంటె చాలా వెనుకబడి వుంది. అన్నపూర్ణ ఇంటిలో అన్నమే కరువాయె నన్నరీతిగా ఎన్నో ప్రకృతి వనరులు, సంపద ఉన్న ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రం విద్యారంగంలో వెనుకబడి వుండడం శోచనీయం. ఈ లోటును భర్తీ చేయడానికై గత కొన్ని సంవత్సరాలుగా రాష్ట్రప్రభుత్వం విరివిగా కృషిచేసి వైద్యకళాశాలలను, ఇంజనీరింగ్ కళాశాలలను, పాఠశాలలను, కొత్తవాటిని స్థాపించి ఇదివరకున్న పాఠశాలలలో విద్యార్థుల సంఖ్యను హెచ్చించింది. పెక్కు మాధ్యమిక పాఠశాలలు ఉన్నత పాఠశాలలుగాను, ఉన్నత పాఠశాలలు హయ్యర్ సెకండరీ పాఠశాలలుగాను అప్‌గ్రేడ్ చేయబడ్డాయి. అయినా ఈ కృషి చాలదు. విద్యాసక్తి పెరుగుతున్నందున ప్రజావసరాల దృష్ట్యా మున్ముందు వాటి సంఖ్య ఇంకా పెరగవలసివుంది.

ఇక పోతే ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగంలోకాని, సంపదవిషయంలోకాని, గుంటూరుజిల్లాది అగ్రస్థానం అనడంలో సందేహంలేదు. అందులోనూ గుంటూరులోనున్నన్ని విద్యాసంస్థలు ఆంధ్రప్రదేశ్‌లో - హైదరాబాద్, విశాఖపట్టణం మినహా - మరెక్కడా కూడా లేవేమో కూడా!

గుంటూరుజిల్లాలో గుంటూరుపట్టణం తరువాత విశేష ప్రాముఖ్యం గలది తెనాలి పట్టణం. తెనాలి పట్టణం తాలూకా కేంద్రం కూడా. ఈ తెనాలి తాలూకాలో

దాదాపు 20 ఉన్నత పాఠశాలలు, పెక్కు మాధ్యమిక, ప్రాథమిక పాఠశాలలు ఉన్నాయి.

> మనస్సు అనేది ఒక రిజర్వాయర్ కాదు; మనస్సును ఒక చైతన్యస్రవంతిగా మలచడమే విద్యకు పరమార్థం.
>
> — జాన్ మేసన్

తెనాలి పట్టణంలో ప్రస్తుతం ఐదు ఉన్నతపాఠశాలలు, ఒక కళాశాల, ఒక సంస్కృత కళాశాల, మరి కొన్ని పాఠశాల లున్నాయి. ఉన్నత పాఠశాలలలో తెనాలి తాలూకా హైస్కూలు ప్రప్రథమంగా పేర్కొనాలి. ఈ పాఠశాలను 1904 వ సంవత్సరంలో నెలకొల్పారు. ఇది కమిటీ పాఠశాల. కొత్తపేటలో నున్న ఈ పాఠశాలకు మారీసుపేటలో ఒక బ్రాంచి పాఠశాల వుంది. ఇది మొనమొన్నటి వరకు మాధ్యమిక పాఠశాలగా వుండేది. ఇటీవలనే దానిని ఉన్నత పాఠశాలగా మార్చారు. తాలూకా హైస్కూలు గుంటూరుజిల్లాలో ప్రప్రథమంగా స్థాపింపబడిన పాఠశాలలలో ఒక్కటిగా పేరుగాంచింది. తెనాలిపట్టణంలోని ఉన్నత పాఠశాల పూర్వం తెనాలి తాలూకా కంతటికి ఒకే పాఠశాల. తాలూకాలోని ఇతర గ్రామాలనుంచి అనేకమంది ఇక్కడ చదువుకునేవారు. ఈ పాఠశాల ప్రతిభకు ఇది 1904 లో స్థాపింపబడి మరొక బ్రాంచి పాఠశాల ఉండి అప్పటినుంచీ దినదినాభివృద్ధి గాంచడమే నిదర్శనం. మాధ్యమిక పాఠశాలలను ఉన్నత పాఠశాలలుగాను, ఉన్నత పాఠశాలలను హయ్యర్ సెకండరీ లేక బహూళార్థ సాధకోన్నత పాఠశాలలుగాను అప్‌గ్రేడ్ చేసే పథకం అమలులోకి వచ్చాక ఈ తాలూకా హైస్కూలును హయ్యర్ సెకండరీ పాఠశాలగా అభివృద్ధిచేశారు. అంతేగాక ఈ పాఠశాలలో వడ్రంగం, నేతపనివంటి వృత్తివిద్యకోర్సులుకూడా వున్నాయి. ఈ పాఠశాలలో బాలురతో పాటు బాలికలకుకూడా ప్రవేశం వుంది.

తదుపరి పేర్కొనవలసినది పురపాలక బాలకోన్నత పాఠశాల. తెనాలి పురపాలక సంఘముచే మొదట మాధ్యమిక పాఠశాలగా ప్రారంభింపబడిన పాఠశాల 1948-49 ప్రాంతంనుంచీ ఉన్నత పాఠశాలగా మార్చబడుతూ వచ్చింది. ఉన్నత పాఠశాలగామార్చిన తదుపరి ఆ పాఠశాలను పురపాలకసంఘ కార్యాలయము నకు మార్చి, ఆ కార్యాలయాన్ని మరొక అద్దెభవనంలోకి మార్చారు. ఈ ఉన్నత

పాఠశాల వయస్సు 13 సంవత్సరాలు. అయినా దానికి స్వంతభవనాలు ఏర్పడలేదు. అందుకై పురపాలకసంఘంవారు కృషిచేస్తున్నారు. వారికృషి త్వరలోనే ఫలించే సూచనలు కనుపిస్తున్నాయి. ఇది కేవలము బాలురకొరకే ప్రత్యేకించిన పాఠశాల. అయినా లోయరు ఫారములలోకి బాలికలకు ప్రవేశముంది. ఈ పాఠశాల ఉన్నత తరగతులలో ఇంజనీరింగ్ కోర్సులుకూడా కొన్ని సంవత్సరాల క్రిందట ప్రారంభింప బడ్డాయి. హయ్యర్ ఫారములలో 15 సెక్షనులు, లోయరు ఫారములలో 14 సెక్షనులు వున్నాయి. ఈ పాఠశాలలో దాదాపు 1200 మంది విద్యార్థులున్నారు.

ఈ పాఠశాలలో యన్. సి. సి. కి చెందిన వివిధ శిక్షణవిభాగాలుకూడా వున్నాయి. ఇన్ని హంగులున్న ఈ పాఠశాలకు స్వంతస్థలంలో స్వంత భవనాలు నిర్మించ తలపెట్టిన కృషి వీలైనంత త్వరలో సఫలీకృతం కావాలని ఆశిద్దాం.

బాలుర విద్యతోపాటు బాలికల విద్యనుకూడా పెంపొందించడానికై తెనాలి పురపాలకసంఘం ఒక బాలికోన్నత పాఠశాలను కూడా నడుపుతున్నది.

ప్రొటెస్టెంటు మిషను శాఖ యాజమాన్యాన నిర్వహించబడుతున్న మరొక హైస్కూలు గూడ తెనాలిలో ఉంది.

1950 వరకు తెనాలి తాలూకాలో ఒక్క కళాశాలకూడా లేదు. ఈ తాలూకా ప్రాంతీయులు కళాశాల విద్యాభ్యాసనకు అటు గుంటూరుకో మరొక చోటికో పోవలసి వచ్చేది. ఈ లోటును భర్తీచేయడానికి తెనాలిలో ఒక కళాశాలను స్థాపించ నెంచి కొందరు ప్రముఖులతో ఒక కమిటీ ఏర్పడి కొన్ని విరాళాలు సేకరించి, 1951లో తెనాలి కళాశాల ప్రారంభించారు. ప్రధమంలో ఒక్క ఇంటర్మీడియట్ ఆర్ట్సు సబ్జక్టులతో ప్రారంభమైంది ఈ కళాశాల. ఈ కళాశాలను బాలికోన్నత పాఠశాలలో ప్రారంభించారు. బాలికల పాఠశాలను వేరొక చోటికి తరలించారు. 1956-57 ప్రాంతాల్లో తెనాలి - గుంటూరు రోడ్డులో స్థలం కొని అక్కడ తాత్కాలికంగా నిర్మించిన షెడ్లలోకి ఈ కళాశాల తరలింపబడింది. ప్రముఖ ఆంధ్ర పారిశ్రామిక వేత్తలు శ్రీ వెలగపూడి రామకృష్ణగారు షుమారు లక్షన్నర రూపాయిలను విరాళంగా ఇవ్వడంతో ఈ కళాశాలకు "వెలగపూడి వెంకట సుబ్బయ్య రామకృష్ణ కళాశాల" అని నామకరణం చేశారు. తదాదిగా ఈ కళాశాలలో ప్రతియేడూ కొత్తతరగతులు ప్రవేశపెట్టబడుతూ రావడమేగాక స్థానికంగా వున్న

ధనికుల విరాళాల సహాయంతో పక్కాభవనాల నిర్మాణం కూడా ప్రారంభమైంది. ప్రస్తుత మీ కళాశాలలో పి. యు. సి., బి. ఏ., బి. యస్. సి., బి. కామ్. కోర్సులు గరపబడుతున్నాయి.

ఇక్కడ బాలికోన్నత పాఠశాల ఒకటి వుండటంవల్ల ఈ కళాశాలలో చేరే బాలికలసంఖ్యకూడా ఎక్కువగానే వుంటున్నది. మరికొన్నాళ్ళు పోతే ఈ కళాశాల బాలికల కళాశాలగా మారుతుందేమో అన్నట్లుగా ఈ కళాశాలలోచేరే బాలికలసంఖ్య ప్రతియేడూ పెరుగుతున్నది,



తెనాలి కళాశాల నిర్వహణలోనూ, పెదపాలెంలోని సేవాశ్రమ వాణిమందిరం నిర్వహణలోను ప్రముఖపాత్ర వహించిన శ్రీ పుతుంబాక శ్రీరాములుగారు.

బాలికా కళాశాల తెనాలికి ఎంతైనా అవసరం! బహుశా దీనినిగుర్తించియే కాబోలు విజయవాడలో కొద్దికాలంక్రింద బాలికా కళాశాలను స్థాపించిన మేరీ స్టెలా కళాశాల పాలకవర్గం మిషనరీవారు తెనాలిలోకూడా ఒక బాలికా కళాశాలను నెలకొల్పే ప్రయిత్నాలు చేస్తున్నారు. తెనాలి-అంగలకుదురు రోడ్డులో ఈ కళాశాల స్థాపించాలనుకుంటున్నారు. అంతవరకూ తెనాలిలోనే ఏదైన ఒక అద్దె భవనాన్ని తీసుకొని అందులో కళాశాలను ప్రారంభించాలనుకుంటున్నారు. ఇందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులుకూడా సమ్మతించారు. బహుశా ఈ కళాశాల ఈ విద్యా సంవత్సరంలోనే ప్రారంభం కావచ్చు. ఈ కళాశాల నెలకొల్పబడితే తెనాలి తాలూకాలోని బాలికలు కళాశాల విద్యాభ్యాసనకై వేరోచోటికి పోనవసరమేర్పడదు.

ఇక పోతే, తెనాలి పట్టణంలో ఒక సంస్కృత పాఠశాల, కళాశాల కూడా వున్నాయి. ఇక్కడి కె. యల్. యన్. సంస్కృత కళాశాల ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి భాషాప్రవీణ, విద్యాప్రవీణ పరీక్షలకు పిల్లలను తయారుచేసి పంపుతుంది. ఆంధ్రదేశములో నున్న పెద్ద సంస్కృత కళాశాలలలో ఇది ఒకటి, ఈ కళాశాలలో

ప్రతిరోజూ 20 లేక 25 మంది వుంటుంటారు. ఇందులో కొంతమందికి నెలకి ఆరు రూపాయిల ఉచితవేతనాన్ని కూడా ఇస్తున్నారు.

గాంధీనగరంలో "శ్రీ యలవర్తి ఆంజనేయశాస్త్రి విశ్వబ్రాహ్మణ సంస్కృత పాఠశాల" ఒకటి వుంది. సంస్కృత విద్యావ్యాప్తికై శ్రీ శాస్త్రిగారు తమ ఆస్తిని సద్వినియోగం చేశారు. ఇందులో విశ్వబ్రాహ్మణ విద్యార్థులకు ఉచితభోజన సౌకర్యం కూడా వుంది. మిగతావారికి ఉచితంగా సంస్కృతాన్ని బోధిస్తున్నారు.

అంతేగాక దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి ఆధిపత్యంక్రింద హిందీ విశారద పరీక్షలవరకు విద్య గరపెడి హిందీపాఠశాలకూడా ఒకటి వుంది. మరియు దేశీయ పశువైద్య విధానాన్ని ప్రోత్సహించు నిమిత్తం దశాబ్దంగా అభినవ సహదేవ శ్రీ యేజళ్ళ శ్రీరాములు చౌదరిగారు పశువైద్య కళాశాలను స్థాపించి ఎంతోమంది వైద్యులను తయారుచేసి యున్నారు. వారి అనంతరం వారి పుత్రులు అదే సంప్రదాయంతో ఆ కళాశాలను విజయవంతంగా నడుపుతున్నారు. ఈ కళాశాలను ప్రభుత్వం గుర్తించినది.

తెనాలి రైలుగేటు కావల శ్రద్ధానంద హరిజనకాలనీ ఒకటి వుంది. ఇందులో హరిజన బాలికలకు హాస్టలు వసతి వుంది. పెక్కు బాలికలు ఇక్కడ వుంటూ పట్టణంలో పాఠశాలలలో చదువుకుంటుంటారు. అంతేగాక కొందరు స్త్రీలకు టీచర్ ట్రైనింగ్ కోర్సును ఈకాలనీలో నేర్పుతారు. దీని నిర్వాహకురాలు శ్రీమతి కొల్లా తాయారమ్మగారు. వారి ఈ స్త్రీజన సేవ ఎంతైనా ప్రశంసింపదగింది.

తెనాలిలోవున్న విద్యాసంస్థలలో ఇవి ముఖ్యమైనవి.

ఇవియేగాక ఇంకా పెక్కు మాధ్యమిక ప్రాథమిక పాఠశాల లున్నాయి.

~~~~~

విద్య యొసగును వినయంబు, వినయమునను<br>
బడయు పాత్రత, పాత్రతవలన ధనము,<br>
ధనమువలనను ధర్మంబు, దానివలన<br>
నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు.

— చిన్నయసూరి
~~~~~



పశువైద్య కళాశాల నిర్మాత; అభినవ సహదేవ:

స్వర్గీయ యేజళ్ళ శ్రీరాములు చౌదరిగారు

# పవిత్ర దేవాలయాలు గ్రంథాలయాలు

శ్రీ పి. అచ్యుతరామ్.

"Next to acquiring good friends, the best acquisition is that of good books." — *Colton.*

కోల్టన్ మహాశయుడు చెబుతున్నది నిజం; కాని సద్గ్రంథసాంగత్యం సత్పురుషుల సాంగత్యాని కేమీ తీసిపోదు.

ఒకరకంగా — కొన్ని పరిస్థితుల్లో, సద్గ్రంథాలకంటె గొప్ప సంగాతకులు కానరారేమో!

మానవుని విజ్ఞాన వికాసాలకు మహత్తర సాధనాల్లో గ్రంథాలయం ఒకటి. ఇందులో రెండభిప్రాయాలకు తావేలేదు. అజ్ఞాన తిమిరంలో, తీరు తెన్నులు తెలియని మానవాళికి మార్గదర్శనం చెయ్యగల వాటిల్లో గ్రంథాలయం వొకటి. ప్రజలను చైతన్య విలసితులజేసి, ఉన్నతపథానువర్తులగునట్లు చేయగల ఉపకరణాల్లో గ్రంథాలయం అగ్రశ్రేణికి చెంది వున్నది. నిద్రాణమైన మానవుని మేల్కొలిపి, జాగరితం చెయ్యగల శక్తిగలవి విద్యాలయాలూ, గ్రంథాలయాలూ.

విద్యాలయాలు గ్రంథాలయాలు అవిభాజ్య వ్యవస్థలు. ఒకదాని ప్రభావం మరొకదానిపై వుంటుంది. ఒకరకంగా ఈ రెండూ కవలలవంటివని చెప్పడం న్యాయం. ఈ రెంటి లక్ష్యం ఒక్కటే. మార్గాలుమాత్రం వేరు కావచ్చు.

ప్రజాస్వామ్య విజయానికి — సంఘభద్రతకు — వ్యక్తివికాసానికి గ్రంథాలయా లెంతగానో దోహదం చేస్తాయి. కాని గ్రంథాలయోద్యమంపట్ల విద్యాధికుల్లో తగిన శ్రద్ధ లేకపోవటం విచారం. రకరకాల అభిప్రాయభేదా లుండవచ్చు; ఉండటం సహజం కూడా.

అయితే సార్వజనీకమైన — వేదికలు కొన్ని వున్నవి. పాఠశాలలు, ఆస్పత్రులు, గ్రంథాలయాలు మున్నగువానిలో పరిమితమైన భావనలకు తావుండరాదు. స్వార్థ ప్రయోజనాలకు గ్రంథాలయాలు ఆలంబనాలు కారాదు. సమిష్టి ప్రయోజనం ధ్యేయమైన వీటిల్లో అనారోగ్య వాతావరణం వాంఛనీయం కాదు.

విద్య నిగూఢగుప్తమగు
విత్తము రూపము

విద్యా వినయసంపన్నతే.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికి ప్రభుత్వం, ప్రజలు అన్యోన్యంగా కృషి చెయ్యాలి. వీరిరువురి కృషిఫలితంగా గ్రంథాలయోద్యమవ్యాప్తి ఫలప్రదమౌతుం దనటంలో సంశయ మేమీ లేదు. వారితోపాటు గ్రంథాలయ నిర్వాహకులు, చదువరులు కూడా గ్రంథాలయ సౌధ నిర్మాణానికి మూలస్తంభాలన్న విషయం విస్మరింపరానిది.

గ్రంథాలయ నిర్వాహకుల నిరంతరాయమైన కృషి అత్యంత ప్రధానం. ప్రజల ప్రభుత్వ పరస్పర సహకార ప్రాతిపదికపై గ్రంథాలయాల నిర్వాహకులు అవిరళంగా పరిశ్రమిస్తే — ఈ ఉద్యమం జయప్రదం కాక తప్పదు.

గ్రంథాలయ ఉద్యమానికి మూలవిరాట్టు భాండాగారి. భాండాగారి ఈ దేవాలయంలో పవిత్ర పూజారి. ఆత డుదాత్తభావసంపన్నుడై, కర్తవ్యోన్ముఖుడై — సంఘశ్రేయస్కాముడై వ్యవహరించిననాడు ఈ గ్రంథాలయోద్యమ స్రవంతి జీవస్రవంతి కాగలదు.

విద్యావంతుడు సాటివానిని విద్యావంతుడు చెయ్యటానికి దీక్ష బూనాలి. లయం కాని దేవాలయాలు గ్రంథాలయాలని గ్రహించటం మంచిది.

7]

# వయోజన విద్యా వ్యాప్తి - గ్రంథాలయాలు

శ్రీ కె. సాంబశివరావు, బి. ఏ.

"హృదయ సౌందర్యములేని శారీరక సౌందర్యము గంధము లేని పుష్పము వంటిది." ప్రస్తుత ప్రపంచ స్థితిగతులను పరిశీలించిన యెడల యుద్ధోన్మాద పిశాచి కరవాలముల జాచి, తన వికృతరూప ముతో కదంత్రొక్కుతూన్న విషయం సర్వజన విదితమే. ప్రపంచ దేశాల మధ్య, పరస్పర ద్వేషాలు అంతరించి, సుహృద్భావము పెంపొందనిచో నీ యభివృద్ధి, నాగరికత నాశనమొందుట తథ్యము. ఆధునిక మానవుడు వైజ్ఞానికంగా బలవంతుడు. ఆ బలం ప్రపంచ సౌఖ్య, సంపదలకు తోడ్పడాలి. ఆనాడే మానవుని నిజమైన హృదయ సౌందర్యం ప్రపంచాన్ని ప్రకాశవంతంగా మార్చివేస్తుంది. ఈ విష యంలో ప్రపంచ దేశాలన్నీ శక్తివంచన లేకుండ కృషి సల్పుతున్నవి. మన భారతదేశం శాంతికాముక దేశం. కాని విద్యావిషయంలో చాల వెనుకబడిన దేశం. విద్యవలన ననేక ఉపయోగము లున్నవి. "విద్య యొసగును వినయంబ"నియు "విద్య నృపాల పూజితము, విద్య నెరుంగని వాడు మర్త్యుడే" యనియు నొక మహాకవి నుడివియున్నాడు. అంతియే గాక "విద్యావర్ధతేః" యనియు "విద్యాస్పర్ధతేః" ననియు కూడ చెప్పి యున్నారు. ముఖ్యముగా వయోజను లీవిషయములో చాల వెనుక బడి యున్నారు. మన వయోజనులు కనీస విషయములను తెలిసికో జాలని దుస్థితిలో నున్నారు. హక్కులతోపాటు ప్రతి పౌరునకు కొన్ని బాధ్యతలుకూడ ఉంటాయి. ఉదాహరణకు వయోజనులు వోటు హక్కును సద్వినియోగ పరచటం లేదు. వోటు అనగా అభిప్రాయము. కాని ఏ విషయము ఆలోచించి నొక యభిప్రాయమునకు రాకుండగనే వీరు తమకిచ్చిన విలువను నష్టపరచుచున్నారు. కావున వయోజను లను విద్యావంతులుగాచేసి వారిని విజ్ఞానవంతులుగా చెయ్యడం చాల అవసరమైనట్టిది. దానివలన వారిలో సంఘీభావము, సమైక్యత, సఖ్యత,



సాహిత్యంలోనూ, గ్రంథాలయోద్యమంలోనూ, వయోజన విద్యా ప్రచారంలోనూ చిరకాలంగా పనిచేస్తూన్న ప్రజా సేవకులు
శ్రీ జాస్తి వెంకట నరసయ్యగారు.

సహృదయత, యనునవి పెంపొందుటకు హెచ్చుగా అవకాశములు కలవు. ఇంకను వారి వివేచనాశక్తి వృద్ధినొంది, మానసిక విలువలు, ఆధ్యాత్మిక విలువలు పెరిగి, అది సంఘ ఔన్నత్యానికే మార్గదర్శకా లవుతాయి.

భారత రాజ్యాంగమునందు ఆర్టికల్స్ 945, 946, యందు రాజ్యాంగ మేర్పడిన పది సంవత్సరముల లోపుగా ప్రతి పౌరుని విద్యావంతుని చేయవలెనన్న ప్రతిన బూనిరిమి. కాని డెబ్బదియైదు శాతము దేశములో యింకను విద్యనేర్వని స్థితిలో నున్నారు. భారతదేశము వ్యావసాయిక దేశము. ప్రతి దేశమందును రైతులు విద్యావంతులే. కాని మన దేశమందలి రైతు స్థితిగతులు వారితో పోల్చిచూచిన యెడల మన కీ సత్యము తేటతెల్లమవుతుంది. ఇతర దేశములు వ్యావసాయికంగా, పారిశ్రామికంగా, ముందుకు అడుగు వెయ్యటానికి కారణం అచ్చటి వయోజనుల విద్యావ్యాప్తియే. వ్యవసాయరంగంలో ఆధునిక పద్ధతులను సమ్మేళించి, అధికోత్పత్తి చేయుచున్నారు. అటులనే పారిశ్రామిక రంగముకూడ పురోగమించుచున్నది. దీనిలోని మరొక విశేష మేమిటంటే తక్కువ శక్తితో ఎక్కువ ఫలసాయము

నార్జించుట. కాలమునుకూడ జాగ్రత్తగా వినియోగించుకొనుట. మనరైతులు, కార్మికులు కూడ ఈ విద్యను నేర్చుకొనిన మనముకూడ నిట్టి యభివృద్ధిని సాధించగలము. అట్లు కానినాడు మన మెంత ఆధునిక యంత్ర సంపదను కలిగియున్నను నది ప్రయోజన రహితమే. కాన వయోజనవిద్య దేశాభివృద్ధిని సాధించుట కొక యుత్తమమార్గము.

పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, వస్తుప్రదర్శన శాలలు, మత సంస్థలు, వ్యాపారసంస్థలు, కార్మిక సంఘములు, గ్రంథాలయములు వయోజన విద్యావ్యాప్తికి తగిన స్థానములు. ప్రస్తుతము పై పేర్కొన్నవానిలో చాల సంస్థ లీ విషయమున పేర్కొన దగిన కృషి సల్పినవి.

ముఖ్యముగా వయోజన విద్యా వ్యాప్తికి గ్రంథాలయము లుత్తమ స్థానములు. సమాజములో, నిశితముగ బరిశీలించినచో, గ్రంథాలయము, విద్యాలయము, దేవాలయము — ఈ మూడును వ్యక్తిని నిర్మలంగా, మానసికంగా, పారమార్థికంగా, అత్యున్నత ప్రమాణములకు కొనిపోవు సాధనములు. ఇందు గ్రంథాలయము విజ్ఞాన నిలయము. ఇందు బహుముఖ విజ్ఞానవంతులు, అనుభవ నీయులు పాఠకులతో పరోక్షముగ సఖ్యము సల్పుతారు. విజ్ఞాన, వినోద, వికాసాల ఆలయము గ్రంథాలయము. ఇవి వయోజనుల్ని తప్పక ఆకర్షిస్తాయి. ఎందువలననగా,

(1) గ్రంథాలయము విజ్ఞానవంతమైన, విలువైన గ్రంథములను పాఠకులకు అందిస్తుంది.

(2) ఇక్కడ లభించు పుస్తకములు వివిధ మనస్తత్వములు గలవారికి కూడ తృప్తినిస్తాయి.

(3) గ్రంథాలయమును వయోభేదము లేక సంఘములోని యన్ని తరగతులవారు నుపయోగించుకొనవచ్చును.

> నా గ్రంథములే నాకు నేస్తములు
>
> — రాబర్ట్ సదే.
>
> సద్గ్రంథావలోకనంకంటె
> సదసద్వివేచనం లేదు.
>
> — బోధాయన.

(4) సాంఘిక, ఆర్థిక, రాజకీయ మత సంబంధములతో ప్రమేయము లేని సమావేశస్థలము.

(5) గ్రంథాలయములోని విషయమును కొంతవరకుగాని బలవంతముగాగాని నుపయోగించుకొనవలెనన్న నియమము లేదు. ఏ వ్యక్తియైనను తన అభిరుచులకు, ప్రయోజనమునకు వలసిన గ్రంథములనే నుపయోగించుకొనవచ్చును.

(6) గ్రంథాలయము శాశ్వతమైన సంస్థ. ఇది ప్రాంతీయ పరిస్థితులకును, విభేదములకును అతీతమైనట్టిది.

కావున వయోజన విద్యావిషయంలో గ్రంథాలయము ప్రధాన పాత్రను నిర్వహించుచున్నది. ప్రప్రథమముగా గ్రంథాలయము వయోజనులకు పుస్తకముల నెన్నుకొనుటలో తగుశ్రద్ధ వహించాలి. ఎన్నుకొనిన దానిని ఆకర్షణీయంగా యేర్పాటు చేయుటలోను దానిని నుపయుక్త పరచుటలో వివిధవ్యక్తుల సంఘములయొక్క సక్రమమైన సలహాల ననుసరిస్తే అది సంఘములోని సాంస్కృతిక జీవనాన్ని మరింత శోభాయమానం చెయ్యగలదు. వయోజన విద్యా విషయంలో కేవలం గ్రంథాలతోనే విద్యను బోధించటం కష్టమైనపని. ముందు గ్రంథాలయములయందు వయోజనులకు ఆసక్తి కలగాలి. అందువలన గ్రంథాలయములు వయోజనుల్ని ఆకర్షించే మార్గాలను అన్వేషించాలి. ఏ విషయమందైనను మొదట ఆకర్షణ ప్రధానమైనట్టిది. కావున గ్రంథాలయము లీ విషయమున ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలి. ఈ విషయమును సాకల్యముగ పరిశీలించి "స్మిత్" వయోజన విద్యావిషయంలో గ్రంథాలయములు ఆరుభాగములుగా కృషి చెయ్యవలసియున్నదని వ్రాసినాడు. అవి ఏవన (1) వయోజనులకు పుస్తకములను, చలన

చిత్రములను, రికార్డులను యింకా యితర విధములైన పరికరములను అందించుట (2) వారి విద్యాబోధనావిధానములను రూపొందించుట (3) విషయములను, పద్ధతులనుకూర్చి సమాజములో సలహాల నిచ్చుట (4) వయోజన విద్యావిషయంలో అనుభవనీయుడైన గ్రంథాలయో ద్యోగుల నియమించుట (5) వీనివలన లభ్యమగు అవకాశములను తెలియచేయుట (6) ఇంకను అన్ని రంగములందును చేయవలసిన ఉమ్మడి కృషి.

పై విధంగా కృషిచేసిన యెడల వయోజనులు ఆకర్షింపబడు టయే గాక సత్వర ప్రయోజనమును కూడ సాధింతురు. చలన చిత్ర ముల ద్వారా నీతివంతమైన, విజ్ఞానవంతమైన విషయములను ఎఱుక పరుచవచ్చును. దేశాభివృద్ధికి జరుగుచున్న కృషి, దేశములోని అన్ని రంగముల కార్యకలాపములు, వ్యావసాయిక, పారిశ్రామిక రంగముల యందలి విశేషములతోగూడిన నెన్నియో నూతన విషయములను తెలియపరుచవచ్చును. తదుపరి అనుభవనీయుడైన గ్రంథాలయో ద్యోగు లుండుటచే గ్రంథాలయము యీ వర్గమువారికి ప్రయోజనము నిచ్చుటకు నవకాశము కలదు. ఈ విధముగ ప్రణాళికా బద్ధముగ నేర్పడిన గ్రంథాలయము పై ప్రయోజనములనుకూడ సత్వరముగ సాధించును.

చదువురాని వయోజనులకొరకు పల్లెలలో ముఖ్యముగ మూడు విధములైన గ్రంథాలయములున్నవి. (1) రెండు వందలనుండి నాలుగు వందలవరకు పుస్తకములుగల శాశ్వత గ్రంథాలయము. ఈ పుస్తకము లన్నియు పురాతనమైనవి. (2) ఇరువదినుండి అరువది పుస్తకముల వరకు ప్రారంభములో నొక యుపాధ్యాయునకు యిచ్చునవి. (3) ఒక పెట్టెలో పుస్తకములుంచి వానిని పల్లెలలో పంచుచుండుట. ఈ విధ మైన గ్రంథాలయములవలన ఏ ప్రయోజనము లేదు. వీనిలో తప్పక మార్పులు తీసికొనిరావాలి. ప్రస్తుతము ప్రజలలో చదువుయందాశక్తి పెరుగుచున్నది. కాని చదువరుల సంఖ్య తగ్గిపోవుచున్నది. దీనికి ఈ


గ్రంథాలయ, వయోజన విద్యాసభలు మన జిల్లాలో జరగటానికి తోడ్పడిన నేటి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణగారు.

క్రింద నుదాహరించినవి కొన్ని ముఖ్యమైన కారణములన వచ్చును.

(1) చదువురాని వయోజనులు విద్యావంతులైన వారిచెంతచేరి వారితో కలసి, కూర్చొనుటకు సిగ్గుపడుట.

(2) వారియందు వారికే విశ్వాసములేక తగు పుస్తకములను నిర్ణయించుకొని చదువుకొనుటకు సందేహించుట.

(3) వయోజనులనుదృష్టిలో నుంచుకొని వ్రాసిన గ్రంథములు చాల తక్కువగ గ్రంథాలయములలో లభించుట.

(4) వయోజనులలో కొందరు కాయకష్టము చేసికొనువారు గ్రంథాలయము పనిచేయు వేళలతో సంబంధము లేక యుండుట.

(5) అన్ని హంగులతోను కూడిన గ్రంథాలయములు లేకపోవుట.

(6) సక్రమమైన పంపిణీ జరుగకపోవుట.

(7) గ్రంథాలయశాస్త్రము నభ్యసించినవారు అవసరములకు తగినంతగా లేకుండుట.

పై కారణములవలన వయోజన విద్యావ్యాప్తి కొంత కుంటుపడుచున్నది. వానిని నిర్మూలించందే నిర్మాణాత్మకమైన ప్రయోజనమును సాధించుట కష్టతమము. ప్రస్తుతము వయోజనుల కుపయుక్త

పడు పుస్తకములను, వాని విలువ గ్రహించి అధిక సంఖ్యలో ముద్రించుచు గ్రంథాలయములకు లభ్యపరచుచున్నారు. ప్రయివేటు ప్రచురణ కర్తలుకూడ సాహిత్య విషయములో ఆసక్తిని కనబఱచుచున్నారు. మన విద్యామంత్రిత్వ శాఖవారు రచయితలకు, గ్రంథప్రచురణ కర్తలకు తగు విధములైన పారితోషికముల నేర్పాటుచేసి యున్నారు. రాష్ట్రప్రభుత్వములుకూడ నీస్థాయిలో పెక్కు గ్రంథములను ముద్రించుచున్నది యునెస్కో సంస్థ, వయోజనవిద్యలో తగు గ్రంథములను రచించినవారిని తగువిధమున సన్మానించుచున్నది. అదియునుగాక మన భారతప్రభుత్వము నీ గ్రంథాలయ విషయములను అన్ని విధముల సాకల్యముగా పరిశీలించి సలహాల నొసంగుటకై నొక "గ్రంథాలయ సలహా సంఘా"న్ని నియమించింది. ఈ సంఘం వయోజన విద్యావిషయంలో నీ క్రింది సలహాలను చేసింది.

(1) రాష్ట్రంలో ఒకటి రెండు ముఖ్యమైన ప్రదేశాల్లో, చదువు నేర్పు పద్ధతులలో శిక్షితులైన గ్రంథాలయోద్యోగుల సహాయంతో విద్యా నైపుణ్యతలను విధానములను ఉత్సాహవంతులైనవారికి తరగతులను నిర్వహించుట.

(2) ఒకరి కొక రుపయోగపడుటకు, గ్రంథాలయోద్యోగులు, సమాజ వికాస విద్యావిషయాలలో పనిచేయు కార్యకర్తలు, సమాజ వికాస కేంద్రమునుండి జిల్లాలవరకు గలవారు, రెండు రంగములందలి విషయములను సంపూర్ణముగా తెలిసికొనుట మంచిది.

(3) గ్రంథాలయోద్యోగులు, సమాజ విద్యావిషయ కార్యకర్తలు ప్రజల విద్యాభిరుచులను అవసరములను పరిశీలించి, ఆ ప్రోగు చేసిన విషయమును ఆ రాష్ట్రములోని పుస్తక పంపిణీ సంస్థకు తెలియ పరచుట.

(4) గ్రంథాలయోద్యోగులు, సమాజ విద్యావిషయ కార్యకర్తలు ఫలప్రదమైన సహకారంతో సమావేశములు జరిపి, విషయములను చర్చించుట.

అంతియేగాక ప్రభుత్వము నేడొక ప్రకటనచేస్తూ ప్రభుత్వము ఈ మూడవ ప్రణాళికాంతమున పుస్తక పంపిణీ సంస్థల ద్వారా కొన్ని పుస్తకములను విడుదలచేయుటకు సిద్ధపడుతున్నట్లు ప్రకటించారు. ఇప్పటికి ప్రభుత్వము పంద్రెండు పుస్తకములను ప్రకటించింది.

గ్రంథాలయాలు వైజ్ఞానిక
దేవాలయములు.

సద్గ్రంథ సంగంబు
సకలార్థ సాధనంబు.

ఈ విధముగా గ్రంథాలయములు వయోజన విద్యా వ్యాప్తికి కృషిసల్పుచున్నవి. ప్రస్తుత అత్యవసర పరిస్థితుల దృష్ట్యా ఇది మరింత నవసరము. మానవుడు యెంతటి విజ్ఞానవంతుడైనను దేశపరిస్థితులను తెలిసికొననినాడా విజ్ఞానము ప్రకాశించదు. అట్లే వయోజనులు దేశ నిర్మాణములో ఎంతటి క్లిష్టపాత్రను నిర్వహించుచున్నను దేశపోకడలను గుర్తించనినాడది వ్యర్థము. ముందు వయోజనులు పౌరుని బాధ్యతలు గుర్తించాలి. ప్రభుత్వమువారీ వయోజన విద్యావ్యాప్తికి గ్రంథాలయాభివృద్ధికి వ్యయపరుస్తున్న కోట్లాది రూపాయలను వృథాపోనియ్యరాదు. ఒకతరంలోని ప్రభావాలు ముందుతరాలవారివైపు కూడ ప్రసరిస్తాయి. ఈ విపరీత ప్రభావాల్ని నిలిపివేయటానికి సంఘంలో వయోజన విద్య చాల అవసరమైనట్టిది. దేశపురోభివృద్ధికి, దేశ సమైక్యతకు ఇది చిహ్నం. ఏనాడు వయోజన విద్యావ్యాప్తి నిర్విరామంగా, నిర్విఘ్నంగా నెరవేరుతుందో, ఆనాడే మనం భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించినవారమవుతాం.



చెట్ట పట్టాల్ పట్టుకొని దే
శస్థులంతా నడువవలెనోయ్,
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్. — గురజాడ

# పౌర గ్రంథాలయాలు ఆర్థికాలు

శ్రీ వి. వెంకటప్పయ్య, బి. ఏ.

గ్రంథాలయం ఒక విజ్ఞాన నిలయం. తరతరాలుగా గ్రంథాలలో యిమిడి యున్న విజ్ఞాన సంపదను ప్రజలకు అందజేయటమే గ్రంథాలయముయొక్క కర్తవ్యం. అర్ధశతాబ్దంగా మన దేశంలో గ్రంథాలయాలు యీ పనిని ఎంతో బాధ్యతతో నిర్వర్తించి ప్రజాజీవితాన్ని అత్యంత ప్రభావితం చేయడానికి యితోధికంగా తోడ్పడిన వనుటలో సందేహంలేదు. స్థూలంగా పరిశీలించినట్లయితే విద్యాలయ గ్రంథాలయాలు, సంస్థల గ్రంథాలయాలు, ప్రత్యేక గ్రంథాలయాలు, పౌర గ్రంథాలయాలు అని మన గ్రంథాలయాలు నాలుగు రకాలుగా ఉన్నాయి. ప్రస్తుతానికి మనం పౌర గ్రంథాలయాలను గురించి కొన్ని విషయాలు తెలుసుకొందాం.

## పౌర గ్రంథాలయాలు

వీటినే సార్వజనీన గ్రంథాలయాలనీ, ప్రజా గ్రంథాలయాలనీ అంటారు. స్థూలంగా చూచినట్లయితే యీ పౌర గ్రంథాలయాలు మూడు విధాలుగా ఉంటాయి. నిర్వహణ, నిధుల సంపాదన వేరువేరుగా ఉంటాయి.

1. ప్రభుత్వ గ్రంథాలయాలు : ప్రజోపయోగంకొరకు ప్రభుత్వమే స్థాపించి నిర్వహించుతోన్న గ్రంథాలయములు. ఉదా : 1. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయము, హైదరాబాదు. 2. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము, గుంటూరు. ప్రభుత్వ నిధులనుంచే యీ గ్రంథాలయాల కగు ఖర్చు భరింపబడుతుంది.

2. స్థానిక గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాలు : చట్టరీత్యా ప్రతి జిల్లాలోనూ ప్రభుత్వముచే ఏర్పరుచబడిన సర్వస్వతంత్ర ప్రతిపత్తిగల స్థానిక గ్రంథాలయ సంస్థలు నిర్వహించు పౌర గ్రంథాలయాలు. ఉదా : జిల్లాకేంద్ర గ్రంథాలయం, నగరకేంద్ర గ్రంథాలయం, శాఖా గ్రంథాలయం, సంచార గ్రంథాలయం యిత్యాది.

జిల్లాలోని స్థానిక సంస్థలన్నీ తమకు అధికారముగల ప్రాంతములో రూపాయికి నాలుగు నయాపైసలు వంతున ఆస్తి పన్నుపై లేదా యింటి పన్నుపై సర్‌చార్జి రూపములో గ్రంథాలయసెస్సు విధిస్తాయి. ఆ రూపంలో ప్రజలనుండి వసూలయిన సొమ్మును స్థానిక సంస్థలు స్థానిక గ్రంథాలయ సంస్థకు చెల్లిస్తాయి. అంతేగాక యీ మొత్తమునకు సమానమయిన సొమ్మును ప్రభుత్వం స్థానిక గ్రంథాలయ సంస్థకు చెల్లిస్తుంది. ఈ మొత్తమును గ్రంథాలయనిధి అంటారు. ఈ నిధినుండి పైన ఉదహరించిన గ్రంథాలయాలు నిర్వహింపబడతాయి.

> విద్య వివేక సోపానము.
>
> విద్య విశేషముగా విరాజిలు విత్తము.
>
> విద్యయొసగును వినయంబు.

3. **ఇతర గ్రంథాలయాలు :** అనగా పై రెండు వర్గములలో చేరని 1. పురపాలక సంఘములు నిర్వహించు గ్రంథాలయములు 2. సహకార సంఘములు నడుపు గ్రంథాలయములు 3. పంచాయతీ పాలనలో ఉన్న గ్రంథాలయములు 4. గ్రామ సంఘాలు, యితర ప్రయివేటు సంస్థల యాజమన్యంలోనున్న గ్రంథాలయాలు, ఆయా సంస్థలు గ్రంథాలయ నిర్వహణకు ప్రతి సంవత్సరము కేటాయించు మొత్తము ప్రభుత్వగ్రాంట్లు, ప్రజల చందాలు యిత్యాదివే యీ గ్రంథాలయాల నిర్వహణ ఆధారాలు. ఈ విధంగా ఒకరినుండి ఆశించిన సహాయం సక్రమంగా అందనప్పుడు లేదా సహాయం సులభంగా పొందే మార్గాలు తెలియనప్పుడు గ్రంథాలయనిర్వహణ కుంటుపడిపోతుంది. నేడు అనేక గ్రామాలలో గల గ్రంథాలయాలస్థితి యిదే విధంగా ఉంది. సరైన కార్యవిధానం (ప్రొసీజర్) తెలియక చాలగ్రాంటులను పొందలేకపోతున్నది.

"ధనమూల మిదం జగత్"

అన్నారు పెద్దలు. డబ్బుతోనే ఈ ప్రపంచమంతా నడుస్తోంది. ఎన్ని కబుర్లు చెప్పినా, ఉపదేశాలు యిచ్చినా డబ్బులేకపోతే ఏమీ జరగదు. అలాగే గ్రంథాలయ నిర్వహణకు డబ్బు కావాలి. నిరంతరమూ కావాలి. ఈ దనార్జనకు గ్రంథాలయ పాలకవర్గం ఎల్లప్పుడు కొన్నిమార్గాలను అన్వేషిస్తూ ఉండాలి. లేనియెడల గ్రంథా

లయపు అభివృద్ధి జరగదు. గ్రంథాలయాలు ఆర్థికంగా కుదుట బడటానికి కొన్ని మార్గాలను ఏర్పాటు చేసుకోవాలి.

## 1. ప్రభుత్వామునుండి గ్రాంట్లు

ఏటేటా రాష్ట్రప్రభుత్వం పౌరగ్రంధాలయాలకు - స్థానిక గ్రంథాలయ సంస్థ పరంగా గ్రాంటు యిస్తుంది. ఈ వ్యాస ప్రారంభంలో చెప్పుకొన్న మూడవ తరగతి గ్రంథాలయాలకు మాత్రమే ఈ గ్రాంటు చెల్లింపబడుతుంది. గ్రాంటు యిచ్చే ముందుగా ప్రతి పౌరగ్రంథాలయము ఈ క్రింది యోగ్యతలు కలిగి ఉండాలి. ఇలా సహాయం పొందే గ్రంధాలయాలను సహాయక గ్రంథాలయాలు (ఎయిడెడ్ లైబ్రరీస్) అంటారు.

1. ప్రభుత్వంనుంచి గ్రాంటు పొందదలచుకొన్న గ్రంథాలయం పౌరులం దరకు ఉపయోగపడే విధంగా నిర్వహించాలి. జాతి మత వర్గ వివక్షత లేక అందరికీ సమానావకాశాలు కల్పించాలి.

2. గ్రంథాలయం రిజిష్టరు అయి యుండాలి. 1860 సొసైటీ రిజిస్ట్రేషన్ చట్టముక్రింద ఆంధ్రప్రాంతములోని గ్రంథాలయాలు, 1350 ఫసలీ, పబ్లిక్ సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టముక్రింద తెలంగాణాప్రాంతపు గ్రంథాలయాలు రిజిష్టర్ అయి యుండవలెను. అయితే యీ నిబంధన ప్రభుత్వము, స్థానిక సంస్థలు, సహకార సంఘాలు నిర్వహించే గ్రంథాలయాలకు వర్తించదు.

3. ప్రతిసంవత్సర ఆరంభంలోనూ పౌర గ్రంథాలయాలు నిర్వహించు పాలకవర్గపు పట్టికను అనగా గ్రంథాలయపు పేరు, సభ్యుల పేర్లు చిరునామాలు స్థానిక గ్రంధాలయ సంస్థ కార్యదర్శిగారికి పంపించవలెను. పాలకవర్గ సభ్యుల పేరులోగాని, చిరునామాలోగాని ఏదైనా మార్పు వచ్చిన ఎడల సదరు ఉద్యోగికి ముప్పది దినములలోగా తెలియపరచవలెను,

4. సత్ప్రవర్తన, ప్రజారోగ్యము, స్థానిక గ్రంథాలయ సంస్థ నిబంధనల ఉల్లంఘనము జరిగితే తప్ప, పౌరులందరు పఠనసామాగ్రిని ఉపయోగించు కొనుటకు, సమాజ విద్యతోసహా పౌరగ్రంథాలయసేవ కుపయోగించు సమస్త కార్యకలాపాలు నిర్వర్తించుటకు అవకాశము కల్పించవలెను.

5. అన్నితెగలవారికి అందు బాటులో ఉండే ప్రదేశములో గ్రంథాలయము ఏర్పరుచవలెను.

6. డైరెక్టర్ నిర్ణయించు కనీసకాలము అనగా కనీసం రోజుకు ఆరుగంటలకు తగ్గకుండా గ్రంథాలయము పని చేయవలెను.

7. గ్రంథాలయములో దిన పత్రికలు, వారపత్రికలు, మాస పత్రికలే గాక పుస్తకము గూడ ఉంచవలెను.

8. గ్రంథాలయములో ఉంచదగు పుస్తకాలకు ఈ దిగువ యోగ్యతలు కలిగి యుండవలెను.



తెనాలి కళాశాల నిర్వహణలో ప్రముఖపాత్ర వహించిన, శాసనసభ్యులు
శ్రీ నన్నపనేని వెంకట్రావుగారు

(అ) అవి సామాన్య ప్రజానీకపు అవసరమును తీర్చవలెను. సాంస్కృతిక స్థాయి కలిగియుండవలెను.

(ఆ) కొన్ని మతములను, వర్గములను రెచ్చగొట్టునవి, వారికి నష్టము, కష్టము కలిగించునవి ఉంచరాదు.

(ఇ) అనుమానాస్పదమైన అభిరుచి, అవాంఛనీయమైన చిత్రాలు గల పుస్తకాలకు, పత్రికలకు స్థాన మివ్వరాదు.

(ఈ) గ్రంథాలయపు పరిసర ప్రాంతములోను వృత్తులు, పరిశ్రమలు, వ్యవసాయమునకు సంబధించిన పుస్తకములను చేర్చుట మానరాదు.

9. డైరెక్టరు నిర్ణయించిన పట్టికలనే ఉపయోగించవలెను.

10. డైరెక్టరు కోరిన సమాచారమును, నివేదికలను ఎప్పటికప్పుడు పంపించవలెను.

11. ప్రభుత్వము నిర్ణయించు ప్రమాణాలు, యోగ్యతలు, షరతులు సంతృప్తికరంగా ఉన్నవో లేవో తెలుసుకొనుటకు డైరెక్టరు లేదా ఆయనచే నామినేటు చేయబడిన ఏ ఉద్యోగి అయినా ప్రతిసంవత్సరము తనిఖీ చేయుటకు వీలు కల్పించవలెను.

12. ప్రతిసంవత్సరము సక్రమముగా ఆడిట్ చేయబడిన లెక్కలను తత్సంబంధమైన స్థానిక గ్రంథాలయ సంస్థకు పంపవలెను.

ప్రభుత్వమునుండి గ్రాంటు పొందదలచుకున్న గ్రంథాలయములు విధిగా పై నియమములను పాటించవలెను. గ్రాంటు పొందదలచుకొన్న గ్రంథాలయ పాలకవర్గము ప్రతిసంవత్సరము ఆగష్టు నెలలోగా స్థానిక గ్రంథాలయ సంస్థ, కార్యదర్శి (గుంటూరుజిల్లాకు సంబంధించి, అరండల్‌పేట, గుంటూరు) గారికి యీ దిగువచూపిన నమూనాలో దరఖాస్తు నందజేయవలెను.

## *గ్రాంటు నిమిత్తము దరఖాస్తు*

1. దరఖాస్తు సమర్పించు స్థానిక సంస్థ పేరు:

2. గ్రంథాలయపు పేరు:

ప్రారంభించబడిన తేదీ:

3. స్థానిక సంస్థా ? లేదా ప్రవేటుసంఘ యాజమాన్యమా ?

4. ప్రవేటుసంఘాల యాజమాన్యము అయినచో, సదరు గ్రంథాలయము రిజిష్టరు అయినదా ?

5. గ్రంథాలయము పౌరులందరకు ఉపయోగముగా నున్నదా? ఆ ప్రదేశము అన్నివర్గములవారికి ప్రవేశయోగ్యముగా నున్నదా?

6, పుస్తకముల పట్టిక, సభ్యుల పట్టిక, పుస్తకములు ఎరువిచ్చుపట్టిక—యీ దరఖాస్తునకు ఒక సంవత్సరము ముందువరకు నిర్వహింపబడి, తనిఖీ ఉద్యోగులకు చూపబడుతున్నవా ?

7. గత సంవత్సరపు ఖర్చులు :

8. గత సంవత్సరములలో గ్రాంటు మంజూరై ఉంటే, ఆ ఖర్చు వివరము,

(గత సంవత్సరములలో గ్రాంట్లు మంజూరయిన ఉత్తరువుసంఖ్య, తేదీ యివ్వవలెను.)

9. పై గ్రాంటులో ఖర్చుకాని మొత్తము:

10. ఈ సంవత్సరములో పాలకవర్గము తమ నిధులనుండి ఖర్చుచేయుటకు సిద్ధముగానున్న మొత్తము: (పంచాయితీల గ్రంథాలయాల విషయంలో యీ సమాచారము ఉదహరించ నవసరము లేదు.)

11. ప్రభుత్వము నుండి కోరుతున్న గ్రాంటు మొత్తము:



గుంటూరుజిల్లా కేంద్ర సహకార బ్యాంకు అధ్యక్షులు
శ్రీ కన్నెగంటి రెడ్డెమ్మ చౌదరిగారు
వీరు యీ బ్యాంకు అధ్యక్షులుగా వచ్చినవారిలో పిన్న వయస్కులు. కార్యదక్షులు. ఇటీవల వీరు తెనాలిలో మహిళా కళాశాల స్థాపనకు విశేషంగా కృషిచేశారు.

12. పౌరులకు యీ గ్రంథాలయ ముపయోగమును గురించి తనిఖీ ఉద్యోగి అభిప్రాయము:

13. స్థానిక గ్రంథాలయ సంస్థ, కార్యదర్శి సిఫారసు:-

స్థలము　　　　　　　　సంతకము :

తేదీ　　　　　　　　హోదా :

స్థానిక గ్రంథాలయ సంస్థ, కార్యదర్శిగారు యీ దరఖాస్తులను పరిశీలించి, గ్రాంటు ఎంత యిచ్చుటకు యోగ్యమయినదో సిఫారసుచేస్తూ పౌర గ్రంథాలయ

శాఖ డైరెక్టరుకు పంపును. ఆ తర్వాత షుమారు రెండు మాసములలోగా గ్రాంటు మంజూరయినట్లు స్థానిక గ్రంథాలయ సంస్థ కార్యదర్శికి సమాచారము వచ్చును. వారు యీ విషయమును సహాయక గ్రంథాలయ పాలకవర్గమునకు తెలియజేయును.

అప్పుడు పాలకవర్గము సమావేశమయి గ్రంథాలయమునకు కావలసిన పుస్తకముల పట్టిక రెండుప్రతులు తయారుచేసి స్థానిక గ్రంథాలయసంస్థ, కార్యదర్శి గారి ఆమోదము నిమిత్తము పంపవలెను. కార్యదర్శిగారు ఆమోదించిన పిదప ఒక ప్రతిని పాలకవర్గమునకు తిరిగి పంపించును. ఈ పట్టికలు తయారుచేయుటలో ఒక విషయంమాత్రం గుర్తుంచుకోవాలి. కొనదలచిన పుస్తకాల మొత్తమునకు దాదాపు సగమువరకు మించిన మొత్తమువరకు పట్టిక తయారుచేయవలెను. అనగా వందరూపాయల వెలగల పుస్తకములు కొనదలచిన యెడల దాదాపు నూటయాభై రూపాయల విలువమేరకు పుస్తకములపట్టిక తయారు చేయవలెను. ఎందుచేతననగా పుస్తకవిక్రేతలు గ్రంథాలయములకు కొంత కమీషన్ యిచ్చెదరు. అంతేగాక కొన్ని కారణాలవలన పట్టికలోగల పుస్తకాలన్నీ కొను సమయానికి తప్పనిసరిగా లభించగలవనే నమ్మకంలేదు.

ప్రభుత్వము మంజూరుచేసిన సొమ్మును ఖర్చుచేయుటలో గ్రంథాలయాలు యీ వ్యాస తొలిభాగములో చెప్పుకొన్నవిగాక యీ క్రింది నియమాలుగూడ విధిగా పాటించవలెను.

1. గ్రాంటుగా మంజూరుచేయు సొమ్ము పుస్తకాలకు, పుస్తకాలు పెట్టుకొనుట కుపయోగించు బీరువాలకు మాత్రమే వినియోగించవలెను. భవనములకు మాత్రం ఉపయోగించరాదు.

2. గ్రంథాలయమున కవసరమయిన భవనములకు, కుర్చీలు, బెంచీలు, యిత్యాది పరికరములకు, సిబ్బందినీ పాలకవర్గమే భరించవలెను.

3. ప్రతి గ్రంథాలయములోనూ గ్రంథ వివరణ పట్టిక నిర్వహించవలెను. దీనితోబాటుగా ప్రయివేటు యాజమాన్యమున ఉన్న గ్రంథాలయములలో సభ్యుల పట్టిక గూడ నిర్వహించవలెను. తనిఖీ ఉద్యోగులు యీ గ్రంథాలయములు చూడ వచ్చినపుడు సదరు పట్టికలు పరిశీలించుటకు వీలు కల్పించవలెను.

> మానవుని మనోవికాసానికి సంబంధించిన చదువుసాములు చిన్నారి పాపల డోలికల్లోనే ప్రారంభ మవుతుంది.
>
> — కోగన్.

4. ప్రభుత్వము మంజూరు చేయు మొత్తమునకు సమానమయిన - మొత్తమును సహకార సంఘములు, ప్రయివేటు సంఘములు తమ విధులనుంచి కేటాయించవలెను. గ్రాంటు మంజూరు చేసిన సంవత్సరము ఏప్రిల్ మొదటి తేదినుండి పాలక వర్గమువారు పత్రికలు, బైండింగు, సూచీముద్రణ, సిబ్బంది, పోషణ యిత్యాది విషయములలోచేసిన ఖర్చులన్నీ వారిచ్చు విరాళముక్రిందికి వచ్చును.

5. పై నియమములను విధిగా పాటించకున్నచో మంజూరయిన గ్రాంటును ఏ సమయములో నయినా ఆపివేయవచ్చును. ఒకవేళ గ్రాంటును చెల్లించిన పక్షంలో ఆ గ్రాంటు మొత్తాన్ని గాని, దానిలో కొంతభాగాన్ని గాని గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారి నిర్ణయానుసారముగా, ఈ నియమోల్లంఘనకు కారణ భూతమైన పాలకవర్గమునుండి గాని వ్యక్తులనుండి సొమ్ముచెల్లించిన ఐదుసంవత్సరములలోగా తిరిగి రాబట్టుకొనుటకు డైరెక్టరుకు అధికారము గలదు. కనుక గ్రాంట్లకు సంబంధించినంతవరకు నియమపాలన విషయంలో పాలకవర్గమువారెప్పుడు ఎంతో జాగరూకత వహించవలెను.

స్థానిక గ్రంథాలయ సంస్థ కార్యదర్శిగారినుండి కొనదలచిన గ్రంథముల పట్టిక ఆమోదము పొందివచ్చినపిదప గ్రాంటుఅయిన సొమ్మును పొందుటకు బిల్లు పంపించవలెను. గ్రంథాలయ పాలకవర్గాన్ని బట్టి మంజూరయిన మొత్తం వచ్చునట్లుగా బిల్లులు సిద్ధంచేసి యీ ప్రక్కనున్న నమూనాలో [*] ౩ ప్రతులు సమర్పించవలెను.

ఈ బిల్లునకు తోడుగా యీసొమ్ము యిదివరలో తీసుకోలేదని, చెల్లింపబడలేదని తెలియపరచు ధృవపత్రమును [†] జతచేయవలెను.

వీటిని అతిజాగ్రత్తగా పూర్తిచేసి యిరువదిరూపాయలకు మించిన ప్రతి వోచరుమీద పది నయాపైసల రెవిన్యూ చీటి అంటించి స్థానిక గ్రంథాలయ సంస్థ కార్యదర్శిగారికి పంపాలి. వారు ఆమోదించిన పిదప యీబిల్లులను గ్రంథాలయ

[*] PAYABLE AT TREASURY

BILL FOR MISCELLANEOUS PAYMENT

*Treasury, month of* *196.*

| | | |
|---|---|---|
| Head of Service Chargeable. | *Major Head :—*<br>*Minor Head : –*<br>*Sub – Head :—*<br>*Sub – Head of appropriation :-*<br>*Detailed Account Head:* | "28 Education - D Special (n) Direct grants to non - government Special Schools grant - in - Aid to Public. Libraries – I Andhra" |

Voucher No. of List of Payments

Received this.................................................................
Day of..............................196 the sum of rupees..............
being the amount payable on account of Library Grant Sanctioned to Aided Libraries in Proceedings R. C. No............ D/...............
of the Director of Public Libraries, (AP) Hyderabad.

Rupees :

Claimant's Signature
Stamp if the amount exceeds
Rupees 20/-

Countersigned for Rs...............

Signature & Designation
of the Officer.

Examined and entered.

Passed for Payment.

Pay Rs.

Designation of officer Accountant.

Officer in-charge of the Treasury.

[•] CERTIFICATE

This is to certify that the amount of Rs.................. not drawn and paid previously which was sanctioned by the Director of Public Libraries, (Andhra Pradesh) Hyderabad in proceedings R. C. No............ Dated...............196

Certificate in triplicate
Nearest Rupee.

Signature.

> విజ్ఞానార్జనకు పెట్టే పెట్టుబడికి చెల్లేమూల్యానికి మించిన మూల్యం మరొకటి వుండదు.
>
> — ఫ్రాంక్లిన్.

శాఖ డిప్యూటీడైరెక్టరుగారికి ఉపసంతకము కోసము పంపును. వారినుండి ఆపని పూర్తయివచ్చిన పిదప స్థానిక గ్రంథాలయ సంస్థ కార్యదర్శిగారు ఆబిల్లులను పాలకవర్గమునకు పంపించును. ఆ బిల్లులను స్థానిక ట్రెజరీలో హాజరు పరచిన యెడల సొమ్ము పొందవచ్చును. ఇంతటితో యీ గ్రాంటుకు సంబంధించిన పని ఆ సంవత్సరానికి పూర్తి అయినట్లే. ఇదే కార్యవిధానం దాదాపు ప్రతిసంవత్సరం అమలులో ఉంటుంది.

ప్రభుత్వమునుండి గ్రాంట్లు గాక గ్రంథాలయానికి డబ్బు సంపాదించడానికి అనేక మార్గా లున్నాయి.

1. దాతలనుండి విరాళాలు: వదాన్యతకు తెలుగుదేశానికి పెట్టిందిపేరు. ఉదారతలో మనం ఎవరికీ తీసిపోము. ఉదాత్తమయిన కార్యాలకు పల్లెలలోనూ పట్నాలలోనూ కొందరు ఎల్లప్పుడూ ముందుకు వస్తూఉంటారు. వారి సదాశయాన్ని గమనించి వారి దృష్టి గ్రంథాలయాల పురోభివృద్ధికి మరలించడం గ్రంథాలయ కార్యకర్తల కనీస కర్తవ్యం. వారిపేరున భవనము నిర్మించెదమనీ, లేదా సద్గ్రంథాలుకొనెదమనీ ఉత్సాహము కలిగించి యీసత్కార్యమునకు పూనుకోవలెను.

అంతేగాక గ్రంథాలయాలకు సొమ్ము పోగుచేయడంలో కొన్ని ప్రాంతాలలో అతి విచిత్రమయిన పద్ధతులను అవలంబించి తోటివారిని ఆశ్చర్యచకితులను చేస్తున్నారు. ఉదాహరణ- గుంటూరుజిల్లా వేటపాలెంలో అమ్మబడిన ప్రతి సిమెంటు బస్తాకు యిరవై అయిదు నయాపైసలు అదనంగా వసూలుచేసి అచట తెలుగుదేశానికి ధ్రువతారగ వెలుగొందుతోన్న సారస్వత నికేతనానికి యిస్తున్నారు. తెనాలి తాలూకా కూచిపూడిగ్రామంలో జరుగు ప్రతి వివాహానికి సౌమిత్రికట్నం వసూలుచేసి ఆ సొమ్మును స్థానిక గ్రంథాలయానికి యిస్తున్నారు. విశాఖజిల్లా అనకాపల్లిలో అమ్మబడు ప్రతి బెల్లపుబుట్టకు పన్నెండు నయాపైసలు అదనంగా వసూలుచేసి ఆ సొమ్మును స్థానికంగా ఉన్న గౌరి గ్రంథాలయానికి యిస్తున్నారు. ఇదే విధంగా అదే జిల్లాలో ఉన్న జగ్గాపురం అనే గ్రామంలో శ్రీమంతులయింట

బిడ్డ పుట్టినప్పుడు పది రూపాయలదాకా వసూలుచేసి స్థానికంగా ఉన్న శ్రీరామ జయంతి గ్రంథాలయానికి యిచ్చి ఆ గ్రంథాలయాన్ని ప్రశంశాపాత్రంగా నిర్వహిస్తున్నారు.

తెలుగుదేశంలో యిలాటి ఉదాహరణాలు వందలాదిగా గలవు. అవసరమయినపుడు ప్రభుత్వసహాయం తీసికొంటూ కేవలం ప్రజాశక్తిపై ఆధారపడి అభివృద్ధి చేసుకొన్న గ్రంథాలయాలు ఎన్నో ఉన్నాయి.

2. సభ్యులనుండి చందాలు: ఉచితంగా గ్రంథాలయసేవ అందజేయటమే గ్రంథాలయోద్యమ పరమావధి. కాని గ్రంథాలయం తన కాళ్ళపై తాను నిలబడి నాలుగు కాలాలపాటు నలుగురికి సేవ చేయాలంటే ఆర్థిక సంబంధమయిన కొన్ని ఏర్పాట్లు చేసుకొనుట అవసరం గదా! అందుకోసం పుస్తకాలు యిండ్లకు తీసుకొని వెళ్ళేవారినిమిత్తం ఆయా ప్రాంతాల పరిస్థితినిబట్టి తడవకు ఒక పుస్తకం తీసుకొని వెళ్ళేవారికి అర్ధరూపాయి లేదా రూపాయి వసూలుచేయడం సమంజసంగా ఉంటుంది. కొన్ని గ్రంథాలయ ఆవరణలో చదువుకొను పుస్తకాలు, పత్రికలు విషయంలో చదువరులనుండి ఎలాటి రుసుము వసూలుచేయుట వాంఛ్యముకాదు. న్యాయముకాదు.

3. పంచాయితీ సమితి: పంచాయితీ రాజ్యమే ప్రధానాశయంగల పంచాయితీ సమితులు గ్రంథాలయాల అభివృద్ధికి యితోధికంగా తోడ్పడుతున్నవి. గ్రంథాలయ పాలకవర్గాలు ఎంతసొమ్ము యిస్తే దానికి సమానమయిన మొత్తాన్ని పంచాయితీసమితి మంజూరుచేసి వారుకోరిన అనేక ఉద్గ్రంథాలను కొనిపెడుతూ ప్రజలలో విజ్ఞాన ప్రచారానికి ఎంతగానో తోడ్పడుతుంది.

4. వినోద ప్రదర్శనలు: ప్రశాంతమైన జీవితాన్నిగడుపుతోన్న పల్లెవాసులకు వినోదాలంటే ఎంతో యిష్టం. అందుకోసంగ్రామములోని ఔత్సాహికులయిన యువకులు యీ కార్యక్రమాలను చేపట్టిన ఎడల తద్వారావచ్చిన ఆదాయాన్ని గ్రంథాలయానికే వెచ్చించవచ్చును. ప్రయోజనకరమయిన యిలాటి కార్యక్రమాలకు పల్లీయులు చక్కని ప్రోత్సాహం యిస్తారనే విషయం అనేక ప్రాంతాలలో రుజువయింది.

సోదర గ్రంథాలయ కార్యకర్తలు పై విషయాలను దృష్టిలో ఉంచుకొని, గ్రంథాలయాల అభివృద్ధిదృష్ట్యా తమ తమ అనుభవాలను జోడించి గ్రంథాలయాలను పటిష్ఠంగా నిర్వహించేందుకు తోడ్పడతారని ఆశిస్తాను. సెలవు.

# గ్రంథాలయములు-స్త్రీలు

శిష్ట్లా సీతాదేవి

గ్రంథము సంసారికి గృహకృత్యములపట్ల సద్గృహిణివంటిది. కార్యాలోచనపట్ల మిత్రరత్నము వంటిది. ప్రయాణకాలమున సంగాతుని వంటిది. బోధనవిషయమున సద్గురువు వంటిది. నీతినియమముల నిరూపించుటకు, నిజాయితీని ప్రేరేపించుటకు శ్రేయోభిలాషులగు మాతాపితల వంటిది. ఆత్మానాత్మ జ్ఞానము గలిగించుపట్ల రాజయోగివంటిది. రాజకీయ శిక్షణముపట్ల ప్రజారంజకుడగు రాజు వంటిది. విద్యాభ్యాసముపట్ల సుశిక్షితుడైన ఉపాధ్యాయుని వంటిది. నవరసభావముల బుట్టించి తన్మయత్వము నొందించుపట్ల రసజ్ఞుడగు నటునివంటిది. అది యిది యననేల— ప్రపంచమున మానవుడు తన జీవితమును – తనజన్మను – సన్మార్గమున, నుత్తమముగ, శ్రేయస్కరముగ, సార్థకము చేసుకోవలయునన్న సద్గ్రంథపఠనము తప్పనిసరి. అదే విధముగా గ్రంథాలయోద్యమముకూడా —

లోకమున విజ్ఞాన మెప్పుడు గ్రంథరూపమున వెలసి వాఙ్మయమభివృద్ధిజెంద ప్రారంభించినదో అప్పుడే ప్రజలయందు విద్యాభ్యాస, విద్యాపోషణాభిలాషలున్ను సద్గ్రంథసంపాదన వాటి సంరక్షణాభిలాషలున్ను బుట్టియుండును. అప్పుడే ప్రజలయందు గ్రమక్రమముగ విద్యాభివృద్ధి గల్గుటతో గ్రంథాలయ నిర్మాణోద్యమము ప్రారంభమయినట్లుగా గ్రహించవచ్చును.

నేడు మనదేశ ప్రజలకు గ్రంథాలయముల స్థాపన ఎంతేని ముఖ్యము – అందులో ముఖ్యముగ పట్టణములలో సంచార గ్రంథభాండాగారము నెలకొల్పుట అతిముఖ్యము —

నేడు పట్టణములలో బాలబాలికలసంఖ్య విపరీతంగా వృద్ధి నొందుచున్నది.

దేశమందలి బాల బాలికల స్థితియే దేశముయొక్క పురోభి వృద్ధిని, నందుకు దగుమార్గములను, భావిదశను సూచించు చుండునని చెప్పక తప్పదు. మన పూర్వీకులు పలుకుచుందురు — "సామాన్య కుటుంబమున నారోగ్యవంతులును, సంతోషితులునగు బిడ్డలు లేని యెడల నే జాతియు సురక్షితమని చెప్ప వలనుపడదు – ఈ బిడ్డలు చక్కని శిక్షణ పొంద రేని వారు తమకును, తమ తలిదండ్రులకును ననర్థదాయకు లగుటయేగాక దేశమంతటికిని భావి వినాశమును సూచించువారుగ నుందురు." — అని.

నేడు బాల్యావస్థలోనున్న వారి చేతులలోనే రేపు జాతీయాభ్యు దయ ముండుననియు, వారిస్థితి ననుసరించి భావి దేశస్థితి పఱుగుననియు నొప్పుకొనక తప్పదు – ఇప్పటి పెద్ద లే మొనర్చినను భావిస్థితి కాధారులు ప్రస్తుత బాలబాలిక లేనని మనం మరవరాదు—

కొందరు మహానుభావులు — సుమారు రిరువది వత్సరములు వచ్చునప్పటికి నరుని వర్తనమును, శక్తిసామర్థ్య వికాసములు ఒక రూపము గాంచవచ్చుననియు, అట్టి తరుణము కనిపెట్టి జాగ్రత్తవహిం చిన వారిని మానవులుగా తయారు చేయవచ్చుననియు పలుకుచుందురు. మరికొందరు పెద్దలు — "పసివాడు లెండు – వాడికి బది వత్సరము లైన లేవు. వానింగూర్చి యింత త్వరలో యింతగా కఠినశిక్షావిధానము నవలంబింప నేల— ముందు ముందు వారికే బుద్ధివచ్చును లే— రాను న్నను సవరించుటకు చాలాకాల మున్నది లే" — అని పలుకుచుందురు. ఇలాంటి ఊహాల కంతూ పొంతూ వుండదని చెప్పక తప్పదు—

నరుని వర్తన మెటుల నెప్పుడెప్పుడు పరిపక్వము గాంచునో పరీ క్షించి చెప్పుట చాల దుర్లభమని నా ఉద్దేశ్యము.

> విద్య - గృహంలో స్నేహితుడుగా - బయట పరిచయకారుడుగా - ఏకాంతంలో ఉపశమన కారకుడుగా - సమాజానికి ఆభరణంగా ఉపకరిస్తుంది. విద్యలేని మానవుడు బ్రహ్మాండమైన బానిస.
>
> — వాల్లే.

ఒకని విద్య - వాడు జన్మించుటకు ఇరువది సంవత్సరములకు ముందే ప్రారంభమగుచున్నదని యొకతత్త్వవేత్త నుడివియున్నాడు—అనగా నరుని శిక్షణయందలి పటుత్వము తల్లివలన విశేషముగ సమకూరుననియు, ఆతల్లి యొక్క సమర్థత యామె బాల్యమునుండి పరిపక్వమగుచు వచ్చుచుండుననియు వారి యర్థమై యుండనోపు - దీని తత్త్వమును విమర్శించి ఆచరణలోనికి దెచ్చుటకు మనకు సద్యస్కాలమున లభించు భాగ్యములేదని చెప్పక తప్పదు. అయినను నట్టి దశ భావినైనను సమకూరుటకు బసిబాలుర విద్యనుగూర్చి ప్రభుత్వమువారు జాగ్రత్తపడుట యవసరమని చెప్పకతప్పదు.

మరియు బాలబాలికలకు విద్య గఱపుటయన్నను ఆయా బాలబాలికలయం దంతర్గతమై యున్న శక్తులను ప్రకాశమునకు దెచ్చుటయే గాని బాలుని దలపై మొట్టియు, చెవుల మెలివెట్టియు, వీపు చెండియు, కొన్ని పుస్తకములందలి పదములను కంఠస్థములు చేయించుటమాత్రం కాదు. పాఠశాలలో గురుబోధవలన గలుగునదంతయు బాలబాలికలు గ్రహించుటకు ప్రేరేపణ మాత్రమే. ఈ ప్రేరేపణ క్రమక్రమముగా ఆదినుండి గల్పింపవలయునుగాని, ఒక్కసారిగ ఇరువదివత్సరముల ప్రాయము వచ్చినంత కల్పించిన నిష్ఫలము కాదా!

కావున బాలబాలికలకు విద్యాభ్యాసన వసతి కేవలం పాఠశాలయందుమాత్ర ముండిన జాలదు - విద్యావిజ్ఞానార్జనం కేవలం విద్యా

లయములందే జరగాలని లేదు. ఇతర విధములుగ కూడ విద్య, విజ్ఞానములను ఆర్జించవచ్చును.

వారు స్వేచ్ఛగా తిరుగుచోట్లను వారివారి శక్త్యానుసారముగ ప్రేరణ మావశ్యకము - వనవిహారములు, సృష్టి పరిశీలన యాత్రలు, నీతి దాయకములగు నాటకములు, ప్రకృతిధర్మముల ప్రదర్శించు చిత్ర రూప దర్శనములు, వ్యాయామశాలలు నావశ్యకములు - వీనినన్నింటి నొకచో సమకూర్చు బాధ్యత గ్రంథాలయములదని చెప్పవలెను - అంటే ఆ యా విద్యాలయములు నిర్వహించకూడదని ఉద్దేశ్యంకాదు. విద్యాలయములతోపాటు ప్రత్యేకముగా గ్రంథాలయములు కూడ నిర్వహించుచుండవలయునని నా ఉద్దేశ్యము. అమెరికాయందిట్టి ప్రతి ష్ఠాపన లనేకములు గలవట- కావున దేశమునందంతట నిట్టివి సర్వసా మాన్యముగ ప్రభుత్వమువారు ఏర్పాటుచేసినచో నిరంతరము దేశీయాభ్యు దయమున కాధారులగు సామాన్యజనులు బిడ్డలు సుశిక్షితులై యుండ గలరు.

బిడ్డలు సుశిక్షితులుగ తయారు కావాలంటే తలిదండ్రులుకూడ కొంతవరకు శ్రద్ధ తీసికొనవలసి వుంటుంది. ముఖ్యముగ స్త్రీలదే ఆ బాధ్యత - కావున - గ్రంథాలయములు ముందు స్త్రీల నుద్ధరించు కార్యక్రమమునకు పూనుకొనవలసి యున్నది. గ్రంథాలయాధి కారులు ముందుగా బాలబాలికలకు స్త్రీలకు సమిష్ఠిగా ఉపయోగపడే కార్యక్రమములు ఊహించి కృషి చేయవలసి వుంటుంది. బస్తీలలో స్త్రీలు సామాన్యముగా గ్రంథాలయములకు హాజరు కావాలంటే చాలా అసంభవము - కారణము - అందుబాటులో లేకపోవటమేమో ననిపిస్తుంది. ప్రథమంగా స్త్రీల కుపయోగపడే విధంగా గ్రంథాలయ ములను నిర్వహించగలిగితే తద్వారా బాల బాలికలను కూడ బాగు చేయవచ్చును. కావున సంచార గ్రంథాలయములను ప్రతి పట్టణము నందు స్థాపించుటకును, సుశిక్షితులైన స్త్రీకార్యకర్తలనుకూడ వాటిలో నియమించి ప్రచారం చేయించగలిగిననాడు స్త్రీసమాజ

> బోధన పాఠశాలావరణతోనే పరిసమాప్తమౌతుంది; కాని విద్య అనేది జీవితంతోనే అంతమౌతుంది
>
> — రాబర్ట్‌సన్.

మున్న వారితో బాటు బాల బాలికలున్న పనిపాటలు చేయలేని ముదుసలి వారున్నూ యీ గ్రంథాలయోద్యమ ఫలిత మును గ్రహించి - యీ ఉద్యమ మునకు చేదోడు వాదోడు గ నుందురని నాకు పూర్తి విశ్వాసం కలుగుచున్నది. మఱియు యీ ప్రచార కార్యమును సెలవులలో విశ్వవిద్యాలయము లందలి పట్టభద్రులైన విద్యార్థి, విద్యార్థినీ బృందములు నిర్వహించునట్లున్నూ, వారికగు ఖర్చులు ఆ యా ప్రాంత ములలో గల, జిల్లాపరిషత్, సమితి, పంచాయితీలు భరించునట్లున్నూ ఒక నిర్ణీత కార్యక్రమం ఏర్పాటు చేసినచో నీ గ్రంథాలయోద్యమము చక్కగ కొనసాగుటయేగాక, నిరుద్యోగసమస్యకూడ కొంతవరకు పరిష్కారము కాగలదు.

చదువన నెట్టిదో యెరుంగక సగంకాలము గడపిన మన బీద ప్రజానీకానికి, బాలబాలికలకు విద్యాబుద్ధులు గరుపుదామనే ఆశ వుండీ కూడ, అవకాశములేక నిస్పృహతో నీరసించివున్న మధ్యరకం కుటుంబాలవారికిన్ని, తామున్న స్థితియే మహోత్కృష్టమైనదని భావించి యధఃపతితులై పోవుచున్న జనసామాన్యమునకు సయితం దారి చూపినట్లగును.

కావున నేడు యీ ఆత్యాయిక పద్ధతులలో - దేశంకోసం జన్మించామని చాటుకుంటున్న నాయకులందరు యీ విషయాలను విపులంగా వివేకంతో పరిశీలించమని విన్నవించుకుంటున్నాను. గ్రామ గ్రామాన గ్రంథాలయం స్థాపించు నేర్పాట్లున్నూ - వాటి ద్వారా గ్రామాభివృద్ధికిన్ని తోడ్పడమని మనవి చేసుకుంటున్నాను.

అంతేగాదు. ఈ కార్యక్రమం నిర్వహించవలసినది కేవలం ప్రభుత్వం, గ్రంథాలయములు మాత్రమేకాదు – మనందరిపైన కూడ ఉంది.

పాఠశాలయందు మనము సంపాదించిన జ్ఞానముతో మాత్రం తృప్తినిజెంది ఊరకుండిన విద్యవలన గలుగవలసిన లాభములను మనము సంపూర్ణముగఁ బొందజాలము – విద్యవలన గలిగిన జ్ఞానమును మన జీవితమునం దనుభవసిద్ధముగుదానినిగ నొనర్చవలెను. చాలమంది యీ విషయమును మఱచి తమ జ్ఞానమును వ్యర్థమగు దానినిగ జేసెదరు. అందుచేత వారు ప్రపంచమున వ్యర్థులగుటయేగాక తమతమ యంతరాత్మలకు గూడ వ్యర్థులగుచున్నారని చెప్పక తప్పదు. చదువుకొనిన విద్యవలన మాత్రమే మనము గొప్పతనమును సంపాదింప జాలము – చేసిన సత్కార్యములవలననే మన జీవితము వికాసమును పొంది యశోవంతము కాగలదు. కావున,

సోదరీ సోదరులారా !

సంపాదించిన ఎంత అల్పజ్ఞానమునైనను మన నిత్య జీవితమునం దనుభవసిద్ధమగునటుల చేసిననే కాని మన జాతియొక్క భావిస్థితి తృప్తికరముగ నుండదను సంగతిని ఎల్లప్పుడును జ్ఞప్తియందుంచు కొనుడు.



మది కుదురఁజేసి చల్లని మాటచెప్పి
కలఁక నెడలించి ధైర్యంబు కలుగఁజేసి
తల్లిదండ్రులఁబోలి పెద్దలనుబోలి
సదుపదేశంబుచేయుఁ బుస్తకమె నీకు.

— వెంకట పార్వతీశ్వరకవులు.

# గ్రామసీమలలో గ్రంథాలయాలు

శ్రీ డి. సాంబశివరావు, బి. ఏ.

ఆధునికయుగంలో జనసామాన్యానికి కావలసిన విజ్ఞానాన్ని అందజేయటంలో గ్రంథాలయాలు ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. ఈ గ్రంథాలయాలు మరింత పటిష్ఠంగా పనిచేయడానికి శాసనబద్ధమైన కట్టుదిట్టాలు అవసరం. అందుకోసం పలువురు గ్రంథాలయ కార్య కర్తలు ఎంతో ఆందోళన చేశారు. తత్ఫలితంగా 1948 సంవత్సరం లోనే గ్రంథాలయ శాసనం రూపొందించబడి దానిలో ఎప్పటికప్పుడు అవసరమయిన చేర్పులు మార్పులు చేయబడుచున్నవి.

మన రాజ్యాంగ సూత్రములు (945, 946) నిర్దేశించినట్లు ప్రతి భారతీయుని అక్షరాస్యునిగ పది సంవత్సరములలోపల చేయుటకు యీ గ్రంథాలయాలు ఎంతో దోహదం యిస్తున్నవనుటలో సందేహం లేదు. ముఖ్యంగా యీ మార్పును మనం పల్లెసీమలలో సులభంగా గ్రహించగలం. పల్లీయులకు దేవాలయం, విద్యాలయం ఎంత అవ సరమో గ్రంథాలయంగూడ అంతే అవసరమని ప్రత్యేకంగా చెప్ప నవసరంలేదు. దేవాలయంవలన భక్తి, జ్ఞాన, వైరాగ్యములు మోక్ష ప్రసాదము గలుగును. పాఠశాలవలన మనుష్యుడు వివిధదశలలో విజ్ఞాన సముపార్జనకు తోడ్పడును. ఈ విజ్ఞానమును ద్విగుణీకృతము చేయుటకు గ్రంథాలయాలు ఎంతో సహాకరిస్తాయి. కొద్ది చదువు కొన్నవారు తమ విజ్ఞానమును వృద్ధిచేసుకొనుటలో గ్రంథాలయాలు ఎంతో చేయూతనిస్తాయి.

విజ్ఞాన మనే మహాసముద్రములో ఎన్నో ముత్యాలు కలవు. వీటన్నిటిని ఏర్చి కూర్చి ఒకచోట చేర్చటమే గ్రంథాలయముయొక్క సార్థకత.

మనం గ్రంథాలయములో ప్రవేశించగనే ప్రపంచములోని విజ్ఞానవేత్తలంతా ఒకచోట గుమిగూడినట్లు ఉంటుంది. ఆవిజ్ఞానవేత్తలు తాము కనిపెట్టిన విషయాలు పాటగనో, పద్యంగనో, వ్యాసంగానో వ్రాస్తూ మన కా విషయాన్ని తెలియపరుస్తారు.

నేడీ గ్రంథాలయములు కేవలము ఒక పుస్తక భాండాగారము గనే ఉపయోగించుకొనక మన పల్లెల్లో దీనిని జనసామాన్యకూడలిగను ఒక కళా కేంద్రముగకూడా ఉపయోగించుకొనుటకు ఆస్కారములు కలవు. గ్రామములోని గ్రంథాలయమువద్ద ప్రతిదినము ఎంతోమంది జనము కూడుదు రనేడి విషయం మనకు తెలిసినదే.

ఇంకా మన గ్రంథాలయములకు ఎక్కువమందిని రాబట్టుటకు ప్రతి గ్రంథాలయానికీ వైజ్ఞానికశాఖ నొకదానిని అనుబంధంచేసి అనేకమంది ఉత్సాహవంతులైన యువతీయువకులలో వినోద కార్య క్రమాలు నిర్వహింప చేస్తున్నట్లయితే యిక లోకానికి ఎంతో మేలు జరుగుటయే గాక యువకుల్లోనున్న ప్రతిభను పెంపొందించుకొనుటకు ఆస్కార ముంటుంది. ఈ కార్యక్రమముల నిర్వహణకు గ్రంథాలయ నిర్వాహకులు ఒక వైజ్ఞానిక సంఘాన్ని నియమించి, ఆ సంఘంద్వారా కవితాగోష్టి, సంగీతగోష్టి, నాట్య, నాటక ప్రదర్శనలు తఫాలవారీగా, ఇప్పించుచుండుటవలన గ్రంథాలయము కేవలము పుస్తక ప్రపంచానికే సంబంధించక, ఒక వైజ్ఞానిక కేంద్రంగా వెలుగొందుతుంది.

ముఖ్యముగ ఇలాంటివి గ్రామ గ్రంథాలయముల్లో వైజ్ఞానిక అనుబంధశాఖను ఏర్పరచటంవలన గ్రంథాలయాలు ఒక నూతన తేజస్సుతో వెలుగొంది అనేకమంది యువ రచయితలు, గాయకులూ, నటకులుగా తయారయి భావి జీవితానికి చక్కని బాటలను ఏర్పరుచు కుంటారు.

అలానే గ్రంథాలయపుపన్నును అక్షరాస్యులు, నిరక్షరాస్యులు అను భేదము లేకుండా చెల్లించుచున్నను, విద్యావంతులే గ్రంథాలయ

ఒకజాతి భవితవ్యం, భద్రత ఆ ప్రజల విద్యా స్థాయి పై ముఖ్యంగా ఆధారపడి వుంటాయి.

— కోసత్.

ప్రయోజనాలను పొందగలుగుచున్నారు. అందుచేత, గ్రంథాలయములచేతనే అక్షరాస్యతా ప్రచారము గావించుట మంచిది. వయోజనుల సంఘ జీవితాన్ని ఆహ్లాదకరంచేసే కేంద్రాలను గ్రంథాలయాలకు అనుబంధంగా స్థాపించి తద్వారా చదువులను వ్యాపింపచేసే ప్రయత్నములను జిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థవారు చేయటం మంచిది.

అటులనే మన గ్రామప్రజలకు సంచార గ్రంథాలయముల ద్వారా గ్రంథాలయసేవను అందించవలసిన కార్యక్రమాన్ని గ్రంథాలయంవారు పూనుకొనగలరని భావిస్తున్నాను.

ఇలా మన గ్రామములలో గ్రంథాలయములను రూపొందించిన నాడు దురభ్యాసాలకు లోనవుతున్న యువకులను ఆ దుష్టశక్తులనుండి విజ్ఞానమువైపు మళ్ళించి, తద్వారా భారతజాతి పురోగమనాన్ని మనం కాంచగలము.



*Except a living man there is nothing more wonderful than a book !*

— Kingsley.

# తాలూకా గ్రంథాలయ దర్శిని

గరికపాటి రామారావు
వెలగా వెంకటప్పయ్య

[ తెనాలి తాలూకాలో గల పౌరగ్రంథాలయములకు సంబంధించిన పూర్తి వివరములు ప్రకటింప వలయునను తలంపుతో ప్రశ్నా పత్రమును దాదాపు 100 గ్రంథాలయాలకు పంపితిమి. మరలమరల వారికి గుర్తుచేసినను అందరినుండి సకాలంలో పూర్తి వివరములు అందలేదు. గ్రంథాలయాలనుండి వచ్చినవి, మిత్రులనుండి వచ్చినవి, మేము సేకరించినవి సమీకరించి వీలయినంత వరకు ఈ క్రింద పొందుపరుస్తున్నాము.]

## తెనాలి మునిసిపాలిటీ ప్రాంతము

### 1. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయం, తెనాలి.

గుంటూరు జిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థవారు ఈ శాఖాగ్రంథాలయాన్ని 1954 సంవత్సరంలో యిచట స్థాపించారు. నాటినుండి దినదినాభివృద్ధి పొందుతూ నేటికి 6000 పుస్తకములు సంతరించుకొన్నది. 60 పత్రికలు తెప్పించబడుచున్నవి. పఠనమందిరము, పుస్తకములు యిండ్లకు ఇచ్చు శాఖ, ఆచూకి శాఖ, స్త్రీలశాఖ, బాలుర శాఖలతో ఈ గ్రంథాలయం అత్యంత ఆధునిక పద్ధతులపై నిర్వహింపబడుతోంది.

గ్రంథ భాండాగారి : శ్రీ వెలగా వెంకటప్పయ్య.

### 2. పురపాలక పౌర గ్రంథాలయం, తెనాలి.

పురపాలక సంఘ ఆధ్వర్యంలో ఈ గ్రంథాలయం 1929 సంవత్సరంలో స్థాపించబడింది. ఈ గ్రంథాలయంలో ఆంధ్రాంగ్ల సంస్కృత భాషలలో అనేక ప్రాచీన గ్రంథాలు, పత్రికా సంపుటాలు షుమారు 5551 ఉన్నవి. 100 పత్రికల వరకు వచ్చుచున్నవి. ఈ గ్రంథాలయాన్ని స్థానిక శాఖా గ్రంథాలయంతో మిళితం చేసే ఆలోచనయున్నది. ఈ గ్రంథాలయానికి అనుబంధంగా ఈ క్రింది 11 పఠన

మందిరములు పనిచేయుచున్నవి. (1) ఉర్దు రీడింగ్ రూము, (2) పినపాడు రీడింగ్ రూము, (3) హరిజనవాడ రీడింగ్ రూము, (4) నాజరుపేట రీడింగ్ రూము, (5) 1 వ వార్డు రీడింగురూము, (6) 23 వ వార్డు రీడింగ్ రూము, (7) కవిరాజు పార్కు రీడింగ్ రూము, (8) గాంధి-ఇర్విన్ పార్కు రీడింగ్ రూము, (9) సాలెపేట రీడింగ్ రూము, (10) 25 వ వార్డు రీడింగ్ రూము, (11) పాడిసన్ పేట రీడింగ్ రూము, ఈ పఠనమందిరములకు పత్రికలు తెప్పించబడుచున్నవి.

గ్రంథ భాండాగారి : శ్రీ టి. మల్లయ్య.

## 3. శ్రీ కన్యకాపరమేశ్వరి గ్రంథాలయం, తెనాలి.

స్థానికంగా ఉన్న శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థాన ధర్మసంస్థవారు పుర జనులకోసం యీ గ్రంథాలయాన్ని 1943 సంవత్సరంలో స్థాపించారు. భవన వసతి కల్పించారు. ఇందు 4000 వరకు పుస్తకము లున్నవి. 50 పత్రికలు తెప్పించబడుతున్నవి. మహిళలకోసం ఇండ్లవద్దకు గ్రంథాలయ ఉద్యోగులు వెళ్ళి పుస్తకములు ఎరువిచ్చే ఏర్పాటు కలదు.

గ్రంథ భాండాగారి : శ్రీ మాంజేటి లక్ష్మీపున్నయ్య.

## 4. ఆంధ్రరత్న గ్రంథాలయం, మారీసుపేట.

పౌరుల ప్రోత్సాహంతో 1929 వ సంవత్సరంలో స్థాపింపబడినది. షుమారు 10,000 రూపాయిల విలువగల భవనం నిర్మించబడినది. ఇచట 2000 వరకు పుస్తకము లున్నవి. ఆధునికమైన గ్రంథములు తెప్పించుటకు నేడు కృషిజరుగు తోంది. ఈ గ్రంథాలయానికి అనుబంధంగా బాలలశాఖ విజయవంతంగా నడుపు తున్నారు.

## 5. శ్రీరామా గ్రంథాలయం, ఐతానగరం.

శ్రీరామాలయ ధర్మకర్త స్వర్గీయ ఆలపాటి పాపయ్యగారు యీ గ్రంథా లయాన్ని 1929 సంవత్సరంలో స్థాపించారు. దేవాలయంలోని ఒక భాగంలో గ్రంథాలయమునకు వసతి కల్పించారు. 2000 వరకు యిచట అనేక ప్రాచీన గ్రంథా లున్నవి. ప్రస్తుత మీ గ్రంథాలయం చురుకుగా పనిచేయడం లేదు.

అధ్యక్షులు : శ్రీ జి. నారాయణరావు.

## తెనాలి పంచాయితీ సమితి ప్రాంతము

**1. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయము, పెదరావూరు.**

బాలసమాజమువారు స్థాపించి ప్రస్తుతము స్థానిక గ్రంధాలయ సంస్థవారికి స్వాధీన పరచిరి. రు. 4000/- ల ఖరీదుచేయు స్వంత భవనము కలదు. గ్రామ పంచాయితీ బోర్డువారి రేడియోగూడ అచట ఉన్నది. పుస్తకముల సంఖ్య షుమారు 6 వేలు. షుమారు 40 పత్రికలు వచ్చుచున్నవి. ఈభవనపు పై భాగమును కూడ గ్రంథాలయమునకు వప్పగించు ఆలోచన పంచాయితీవారికి వున్నది.

గ్రంథ భాండాగారి : శ్రీ వేమూరి శివరామప్రసాద్.

**2. శ్రీ సరస్వతీ నిలయము, కూచిపూడి.**

1913 వ సం॥ ము జూన్ 15 తేదీన నీ గ్రంధాలయమును విద్యార్థులు స్థాపించిరి. షుమారు 3000 రూ॥ లు విలువగల స్వంత భవనము గలదు. ఒక ఎకరము మాగాణి కలదు. దీనిలో షుమారు 3000 గ్రంథము లున్నవి. పత్రికలు తెప్పించబడుచున్నవి.

**3. ఆంధ్ర సరస్వతీ నిలయం, మండూరు.**

గ్రామస్థుల సహకారంతో 1923 సంవత్సరంలో స్థాపించబడినది. శాశ్విత భవనము నిర్మింపబడినది. స్వర్గీయ శ్రీ తోకల నాగయ్యగారు ఈ గ్రంథాలయాభి వృద్ధికి ఎంతో పాటుపడ్డారు. పుస్తకములు 2500 వరకు ఉన్నవి. పత్రికలు 10 వస్తున్నవి. శ్రీ వెన్నం బసవయ్యగారు దశాబ్దంగా గ్రంథాలయాన్ని కంటికి రెప్పగా కాపాడుతున్నారు. రిజిష్టరయినది.

అధ్యక్షులు : శ్రీ గరికపాటి రామారావు.

**4. శ్రీ సర్వజన విద్యాప్రదాయినీ పుస్తక భండాగారము, సంగంజాగర్లమూడి.**

1915 వ సంవత్సరమున స్థాపింపబడినది. దీనికి ప్రత్యేకమయిన భవనము గలదు. రిజిష్టరయినది. ఇచట ప్రతిసంవత్సరము గణపతి ఉత్సవములు జరుపు చుందురు. ప్రస్తుతం 4000 వరకు పుస్తకము లున్నవి.

5. పంచాయితీ గ్రంథాలయము, యడ్లపల్లి.

ఇది 1934 సంవత్సరములో స్థాపించబడెను. ఇది అలపర్తి నాగయ్యగారి సత్రమున యున్నది. గ్రంథములు 1000 గలవు. పత్రికలు వచ్చుచున్నవి.

అధ్యక్షులు : శ్రీ మన్నె సత్యనారాయణ.

6. పంచాయితీ గ్రంధాలయం, జంపని.

పంచాయితీ సహకారంతోనూ, పౌరుల ప్రోత్సాహంతోనూ, ఈ గ్రంథాలయం నేడు విజయవంతంగా నడుస్తోంది. భవన వసతి యున్నది. 2000 వరకు పుస్తకము లున్నవి. పత్రికలు తెప్పించబడుచున్నవి.

అధ్యక్షులు : శ్రీ సి. హెచ్. వెంకయ్యగారు.

7. పంచాయితీ గ్రంథాలయం, ఎరుకలపూడి.

అధ్యక్షులు : శ్రీ తాడిబోయిన శంకరరావు.

8. పంచాయితీ గ్రంథాలయం, శిరిపురం.

అధ్యక్షులు : శ్రీ పోపూరి సుబ్బారావు.

9. పంచాయితీ గ్రంధాలయం, నేలపాడు.

అధ్యక్షులు : శ్రీ యస్. రామచంద్రయ్య.

10. పంచాయితీ గ్రంధాలయం, కెవెవరం.

అధ్యక్షులు : శ్రీ యల్. యల్. వి. జి. కృష్ణమూర్తి.

11. పంచాయితీ గ్రంధాలయం, కోపల్లె.

అధ్యక్షులు : శ్రీమతి నల్లూరి వనజాక్షమ్మ.

12. పంచాయితీ గ్రంధాలయం, వలివేరు.

అధ్యక్షులు : శ్రీ అప్పిరెడ్డిగారు.

13. పంచాయితీ గ్రంథాలయం, ఎడవూరు.

అధ్యక్షులు : శ్రీ తోట వెంకటపతి.

14. యూత్ రీడింగు రూమ్ – పోతుమర్రు. (స్థాపితం – 1962)
15. శ్రీ వివేకానంద పుస్తక భాండాగారము, కంచెర్లపాలెం.
16. పంచాయితీ లైబ్రరీ, నందివెలుగు.
17. పంచాయితీ గ్రంథాలయము, చినపలివి.

అధ్యక్షులు : శ్రీ అవుతు సోమారెడ్డిగారు.

## అమృతలూరు పంచాయితీ సమితి ప్రాంతము

1. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయం, అమృతలూరు.

గ్రంథాలయోద్యమ తొలిదశ 1912 సంవత్సరంలో స్థాపించబడిన శ్రీ భాషా సంజీవనీ గ్రంథాలయాన్ని 1953 సంవత్సరంలో స్థానిక గ్రంథాలయ సంస్థకు అప్పగించబడింది. ఇచట సంస్కృతాంధ్రాంగ్ల హిందీ గ్రంథాలు, పత్రికా సంపుటాలు 11000 వరకు ఉన్నవి. తాలూకాలో ఇదే పెద్ద పౌర గ్రంథాలయం. దీనికి షుమారు పదివేల రూపాయిల విలువగల శాశ్వత భవన మున్నది.

గ్రంథ భాండాగారి : శ్రీ కె. బసవపున్నయ్య.

2. పంచాయితీ గ్రంథాలయము, వేమూరు.

1962 సంవత్సరంలో పంచాయితీ అధ్వర్యంలో స్థాపించబడింది. ఇప్పటి వరకు 454 పుస్తకములు మాత్రం ఉన్నవి. కొన్ని పత్రికలు వచ్చుచున్నవి.

అధ్యక్షులు : శ్రీ కె. వెంకటేశ్వరరావు.

3. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయం, ఇంటూరు.

గ్రామస్థులు నిర్మించిన భవనములో యీ గ్రంథాలయం 1958 సంవత్సరములో స్థాపించబడినది. పుస్తకములు 3000 వరకు ఉన్నవి. 35 పత్రికలు వచ్చుచున్నవి.

గ్రంథ భాండాగారి : శ్రీ భావనారాయణ.

4. పంచాయితీ గ్రంథాలయం, పాంచాలవరం.

పంచాయితీ అధ్వర్యంలో 1963 సంవత్సరంలో అమృతలూరు పంచాయితీ సమితి సహకారంతో స్థాపించబడింది. ఈ సంవత్సరంలో 400 వరకు పుస్తకాలు కొనబడినవి.

అధ్యక్షులు : శ్రీ యల్. గంగయ్య.

5. రాజరాజ నరేంద్ర గ్రంథాలయం, గోవాడ.

1918 సంవత్సరమున శ్రీ పరుచూరి రాఘవయ్య, శ్రీ వేమూరి నాగేంద్రం గార్లచే స్థాపించబడినది. ఈ గ్రంథాలయమునకు శాశ్వత భవన మున్నది. పుస్తకముల సంఖ్య 6224.

అధ్యక్షులు : శ్రీ పావులూరి వెంకయ్య.

6. శ్రీరామకృష్ణ గ్రంథాలయం, రావికంపాడు.

1917 సంవత్సరంలో శ్రీ దొడ్డపనేని బుచ్చిరామయ్యగారిచే స్థాపించబడినది. ప్రస్తుతం పంచాయితీ దీనిని నిర్వహిస్తున్నది. గ్రామస్థుల సహకారంతో శాశ్వత భవనము నిర్మింపబడినది. పుస్తకములు షుమారు 1000 ఉన్నవి. పత్రికలుగూడ తెప్పించబడుచున్నవి. సమీపమునగల పల్లెలలకు కూడ పుస్తకములు ఎరువివ్వబడుచున్నవి.

అధ్యక్షులు : శ్రీ దొడ్డపనేని వీరయ్య.

7. వివేకానంద గ్రంధాలయం, తురుమెళ్ళ.

ఈ పుస్తకాలయం 1915 వ సంవత్సరం విద్యార్థులచే స్థాపింపబడినది. ప్రస్తుతం పంచాయితీ యాజమాన్యంలో నున్నది. ప్రత్యేకమయిన స్వంత భవన మున్నది. దీనిలో వెయ్యిపుస్తకములు, పత్రికలు గలవు.

8. శ్రీ మహాత్మాజీ పఠనాలయం, ఎలవర్రు.

యువకులచే 1925 సంవత్సరములో స్థాపించబడినది. దీనిలో 1000 పుస్తకములు గలవు. స్వంత భవనము గలదు.

9. శ్రీ నన్నయార్య గ్రంధానిలయం, పెదపూడి.

1915 సంవత్సరములో యువజనులచే స్థాపించబడినది. ఇందు 2000 గ్రంథములు గలవు. స్వంత భవనము 2500 రూపాయిలది కలదు. ఈ భవనము నల్లమోతు శేషగిరిరావుగారి జ్ఞాపకార్థము వారి తల్లి దుర్గాంబ గారిచే నిర్మింపబడినది.

10. శ్రీమ దిందిరా నిశాంత గ్రంథాలయం, మూలుప్వారు.

1915 వ సంవత్సరములో యిది స్థాపించబడినది. గ్రామస్థుల సహకారముచే 4000 రూపాయల విలువగల భవనము నిర్మింపబడినది. ఇందు 1500 పుస్తకములు గలవు.

11. పంచాయితీ గ్రంథాలయం, తురుమెళ్ళ.

అధ్యక్షులు : శ్రీ పర్వతనేని శివయ్య.

12. పంచాయితీ గ్రంథాలయం, పెదపూడి.

అధ్యక్షులు : శ్రీ రావెళ్ళ సత్యనారాయణ.

13. పంచాయితీ గ్రంథాలయం, ఇంటూరు.

అధ్యక్షులు : శ్రీ ఆళ్ళ సాంబిరెడ్డి.

14. పంచాయితీ గ్రంథాలయం, చిన పులివర్రు.

అధ్యక్షులు : శ్రీ వి. రామమూర్తి.

15. పంచాయితీ గ్రంథాలయం, ప్యాపర్రు.

అధ్యక్షులు : శ్రీ మొవ్వ శివరామయ్య.

*ఈమని పంచాయితీ సమితి ప్రాంతము*

1. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయం, కొలకలూరు.

శ్రీ తాళ్ళూరి రాఘవయ్యగారు వారి మేనల్లుని జ్ఞాపకార్థము నిర్మించిన భవనములో స్థాపించిన గ్రంథాలయమును 1955 సంవత్సరములో స్థానిక గ్రంథాలయ సంస్థవారి కప్పగించిరి. నాటినుండి దినదినం అభివృద్ధి పొందుతూ నేటికి 6000 వరకు పుస్తకములు సంతరించుచున్నది. గ్రామస్థుల సహకారంకూడ ఈ గ్రంథాలయమునకు లభించుచున్నది.

గ్రంథాలయాధికారి : శ్రీ వల్లూరి వెంకటేశ్వరరావు.

2. శ్రీ సీతారామభక్తసంఘ పంచాయితీగ్రంథాలయం, తుమ్మపూడి.

శ్రీ సూర్యదేవర సంజీవరాయణంగారు 1932 సంవత్సరములో స్థాపించిరి. ప్రస్తుత మిది పాంచాయితీ పాలనలో నున్నది. ఈ గ్రంథాలయము ఊరి సత్రమున గలదు. పుస్తకములు 1000 ఉన్నవి.

అధ్యక్షులు : శ్రీ సూర్యదేవర రాజా.

3. జి. యల్. యల్. ఏ. శాఖా గ్రంథాలయం, దుగ్గిరాల.

దాదాపు రెండు దశాబ్దాలనుండి శ్రీ భాషాభివర్ధని గ్రంథ నిలయం పేరున నడుస్తోన్న గ్రంథాలయమును 1959 సంవత్సరములో స్థానిక గ్రంథాలయ సంస్థకు భవనముతో సహా అప్పగించినారు. నాటినుండి యీ గ్రంథాలయం ఎంతో విజయ వంతంగా నడుస్తోంది. పుస్తకములు 2500 ఉన్నవి,

గ్రంథాలయాధికారి : శ్రీ కందేపి గోకుల్‌చంద్.

4. సేవాశ్రమ వాణి మందిరం, పెదపాలెం.

1919 సంవత్సరంలో శ్రీ మాలెంపాటి రంగయ్య, శ్రీ పుతుంబాక శ్రీరాములు, శ్రీ పాతూరి నాగభూషణం గార్లచే నీ గ్రంథాలయం స్థాపించబడినది. ఇందు 6000 వరకు పుస్తకములు, పత్రికా సంపుటములు కలవు. దీని తరపున నిర్వహింపబడిన బోటుగ్రంథాలయం యావదాంధ్రదేశంలోనూ ప్రశంసల నందుకొన్నది. ఇటీవల యీ గ్రంథాలయమునకు యిరవై వేల రూపాయిల విలువ గల అతిసుందరభవనము నిర్మింపబడినది.

గ్రంథ భాండాగారి : శ్రీ మేళ్ళచెర్వు వెంకటేశ్వర్లు.

5. శ్రీ సనాతన శైవసమాజ పుస్తక భాండాగారము, ఈమని.

శ్రీ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారిచే 1913 సంవత్సరమున స్థాపించ బడినది. ఇందు 2000 పుస్తకములు గలవు. భవన వసతి యున్నది.

6. పంచాయితీ గ్రంథాలయం, మున్నంగి.

అధ్యక్షులు : శ్రీ బొంతు గోపాలరెడ్డి.

7. పంచాయితీ గ్రంథాలయం, చింతలపూడి.

అధ్యక్షులు : శ్రీ నల్లనూకల శ్రీరాములు.

8. పంచాయితీ గ్రంథాలయం, కుంచవరం.

అధ్యక్షులు : శ్రీ వేదాంతం కృష్ణప్రసాదు.

9. పంచాయితీ గ్రంథాలయం, మోరంపూడి.

అధ్యక్షులు : శ్రీ జంపాల వెంకటరామయ్య.

10. పంచాయితీ గ్రంథాలయం, రేవేంద్రపాడు.

అధ్యక్షులు : శ్రీ చల్లపల్లి సుదర్శనరావు.

*కొల్లిపర పంచాయితీ సమితి ప్రాంతము*

1. శ్రీ వాణి విలాస గ్రంథాలయం, కొల్లిపర.

గ్రామ పంచాయితీ ఆధ్వర్యంలో యీ గ్రంథాలయం రెండు దశాబ్దాలుగా నిర్వహింపబడుతోంది. దీనిలో పుస్తకములు 2000 వరకు యున్నవి. దినపత్రికలు 3 మాత్రం తెప్పించబడుతున్నవి. దీనికి ప్రత్యేకంగా గ్రంథ భాండాగారిని నియమించు ఆలోచన పంచాయితీవారికి కలదు.

అధ్యక్షులు : శ్రీ గాదిరెడ్డి గోపిరెడ్డి.

2. శ్రీ అవుతు రామిరెడ్డి గ్రంథాలయం, కొల్లిపర.

మాజీ శాసనసభ్యుడు స్వర్గీయ అవుతు రామిరెడ్డి జ్ఞాపకార్థం యీ గ్రంథాలయం 1956 సంవత్సరంలో స్థాపించబడినది. దీనికి ఆరువేల రూపాయల విలువ గల సుందరభవన మున్నది. షుమారు వెయ్యి పుస్తకము లున్నవి. పత్రికలు తెప్పించబడుచున్నవి.

3. పంచాయితీ గ్రంథాలయం, అనంతవరం.

ఈ గ్రంథాలయం పంచాయితీ అధ్వర్యంలో 1956 సంవత్సరంలో స్థాపించబడినది. పుస్తకములు ప్రస్తుతం 115 మాత్రం ఉన్నవి. పత్రికలు 5 తెప్పించబడుతున్నవి.

అధ్యక్షులు ; శ్రీ నొప్పులపూడి నారాయణ.

4. నాగభూపాల గ్రంథాలయం, కొల్లూరు.

శ్రీ సూర్యదేవర రాఘవయ్యగారు 1923 సంవత్సరంలో స్థాపించిరి. దీనికి స్వంత భవనము గలదు. 2000 పుస్తకము లున్నవి. పత్రికలు తెప్పించబడుచున్నవి.

5. పంచాయితీ గ్రంథాలయం, కొల్లూరు.
అధ్యక్షులు : శ్రీ వి. వెంకటరామయ్య.

6. పంచాయితీ గ్రంథాలయం, దోనేపూడి.
అధ్యక్షులు : శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణ.

7. పంచాయితీ గ్రంథాలయం, ఈపూరు.
అధ్యక్షులు : శ్రీ తాతినేని వెంకటేశ్వర్లు.

8. పంచాయితీ గ్రంథాలయం, దావులూరు.
అధ్యక్షులు : శ్రీ మొవ్వా గోపాలరావు.

9. పంచాయితీ గ్రంథాలయం, శివలూరు.
అధ్యక్షులు : శ్రీ వి. సీతారామిరెడ్డి.

10. పంచాయితీ గ్రంథాలయం, వరహాపురం.
అధ్యక్షులు : శ్రీ. కె. సాంబశివరావు.

11. పంచాయితీ గ్రంథాలయం, చిలుమూరు.
అధ్యక్షులు : శ్రీ రావూరి రాఘవయ్య.

## చుండూరు పంచాయితీ సమితి ప్రాంతము

1. శ్రీ దాదాభాయి నౌరోజి గ్రంథాలయం, చుండూరు.

స్వర్గీయ గొర్రెపాటి పిచ్చిరెడ్డిగారిచే 1915 సంవత్సరంలో నీసంస్థ స్థాపించబడినది. షుమారు 1500 గ్రంథము లున్నవి. స్వంత భవనముగూడ నీ గ్రంథాలయమున కున్నది.

2. చౌదరి గ్రంథాలయం, మోపర్రు.

శ్రీ కొత్తపల్లి వెంకట సుబ్బయ్యగారిచే 1916 సంవత్సరంలో స్థాపించబడినది. దీనికి స్వంత భవన మున్నది. ఈ గ్రంథాలయము రిజిష్టరయినది. ఇందు 2000 పుస్తకము లున్నవి.

3. రాధాకృష్ణ గ్రంథాలయం, ఆలపాడు.

దేశభక్తులు చుండూరు వెంకయ్యగారిచే 1924 సంవత్సరములో స్థాపించబడినది, రిజిష్టరయినది. ఇందు షుమారు 1500 పుస్తకము లున్నవి. పత్రికలు తెప్పించబడుచున్నవి.

అధ్యక్షులు : శ్రీ చుండూరు వెంకయ్య.

4. సీతారామ గ్రంథాలయం, బోడపాడు.

యడ్లపాటి సీతయ్యగారిచే 1924 సంవత్సరంలో స్థాపించబడినది. ఇందు 1000 పుస్తకము లున్నవి. పత్రికలు వచ్చుచున్నవి.

5. వాసిరెడ్డి చిన వెంకయ్యగారి గ్రంథాలయము, వడ్లమూడి.

దీనిని పండిత వాసిరెడ్డి వెంకట సుబ్బయ్యగారు వారి తండ్రిగారి జ్ఞాపకార్థము స్థాపించిరి. దీనికి 1200 రూపాయల విలువగల భవన మున్నది. ఇందు వెయ్యి గ్రంథములు గలవు.

6. సూర్యదేవర యజ్ఞమాంబా పంచాయితీ పఠనమందిరం, చేబ్రోలు.

శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మగారిచే 1936 సంవత్సరమున స్థాపించబడినది. ఇందు షుమారు 4000 పుస్తకము లున్నవి. పాతికవేల రూపాయల విలువగల భవనమును శ్రీ సూర్యదేవర నరసయ్యగారు నిర్మించి గ్రంథాలయమున కిచ్చినారు. ప్రస్తుతము పంచాయితీ యాజమాన్యంలో నిర్వహింపబడుతుంది.

అధ్యక్షులు : శ్రీ వాసిరెడ్డి నరసింహారావు.

7. పంచాయితీ గ్రంథాలయం, మోదుకూరు.

అధ్యక్షులు : శ్రీ యమ్. వీరారెడ్డి.

8. పంచాయితీ గ్రంథాలయం, మోపర్రు.

అధ్యక్షులు : శ్రీ కె. వెంకటసుబ్బయ్య.

9. పంచాయితీ గ్రంథాలయం, వేటపాలెం.

అధ్యక్షులు : శ్రీ ఘంటా రామకృష్ణయ్య.

10. పంచాయితీ గ్రంథాలయం, కోడితాడిపర్రు.

అధ్యక్షులు : శ్రీ జి. వెంకటేశ్వర్లు.

11. పంచాయితీ గ్రంథాలయం, తోట్లపాలెం.

అధ్యక్షులు : శ్రీ యన్. వెంకటేశ్వరరావు.

12. శ్రీ సరస్వతీ నిలయం, వామనగుంటపాలెం.

13. పంచాయితీ గ్రంథాలయం, పెదగాదెలవర్రు.

అధ్యక్షులు : శ్రీ కె. నరసింహారావు.